"కమనీయమగు విద్య కామధేనువుభంగి
కామితార్థంబుల గలుగజేయు."

# సనాతన నీతిబోధ.

BY

**K. G. BABU RAO,**

**M. A., B. L.,**

DISTRICT MUNSIF, ELLORE.



ఉచితముగా పంచిపెట్టుట కచ్చొత్తింపఁ
బడియె.

1934.

శ్రీ

"కమనీయమగు విద్య కామధేనువుభంగి
కామితార్థంబుల గలుగజేయు."

# నూతననీతిబోధ.



By

K. G. BABU RAO, M. A., B. L.,

DISTRICT MUNSIFF, ELLORE.



ఉచితముగ పంచిపెట్టుట కచ్చొత్తింపబడెను.

1934.

# గీతమాలిక.



బాలభానుని కిరణముల్ పై బడంగ
వింతకాంతులతో మబ్బు వెలయు; మబ్బు
మహిమ లేదందు, భానుని మహిమగాని.
జలనిధులనుండి పైఁకేగి జలముమరల
వర్షరూపాన పుడమిపైఁ బడెడుశక్తి
జలములకు లేదు, సూర్యునకలదుగాని.
చిత్రవర్ణములందాల్చి చెలువునించు
శక్రచాపంబుఁ గల్పింప జాలు నేర్పు
వర్షమున లేదు, సూర్యబింబమునగాని.
వృక్షసంతతి కన్నుల విందుగాగ
పుష్పఫలగుచ్ఛములు గల్గి పొలుపుమీఱు
వృక్షములు గావు, కారణ మినుఁడుగాని.
అటులె మద్విరచిత గ్రంథ మందుగలుగు
గుణచయంబున కేను కారణముగాను
అఖిల మహిమల కాస్పదమైన విభుఁడు
సూర్యనారాయణుఁడె సర్వసూత్రకర్త.



# తొలి పలుకు.



ఒకగోవును దెచ్చి పోషించినయెడల నదియింటికి లక్ష్మియై యనేకవిధములఁ గాపాడును. గోముఖవ్యాఘ్రమును బెంచిన యెడలఁ బెట్టినన్నాళ్ళు తిని తుదకు పెంచువానిఁగూడ భక్షించును. మంచిచెడ్డల జ్ఞానము లేకపోయినను, జీవకోట్లనేకములు బ్రతుకుచున్నట్లు బ్రతుకవచ్చునుగాని మంచిని చెడ్డగను, చెడ్డను మంచిగను పొరబాటుపడి ప్రవర్తించిన యెడల నెన్నికష్టములు కలుగగలవో యోచింపుము.

How many of us at this very hour
Do make a life-long trouble for ourselves
By taking true for false and false for true.

ప్రస్తుతకాలమున పైవిధముననే మనకితరులవలనగలుగు బాధలకన్న మనవలననే మనకుగలుగుచున్న బాధ లధికముగనున్నవని, నీతియొక్క తత్వమును ప్రజలకు సులభముగ దెలియుటకీగ్రంథము రచింపబడినది.

అసమానములగు ధర్మశాస్త్రము లనేకము లుండగా, ధర్మమార్గమును దెల్పుటకు మఱొక గ్రంథము రచించు టవసరమా యని యడుగవచ్చును. మనము నివసించు గృహమును

విడిచి పదిరోజులు తాళమువేసి యెచటికైననేగి తిర్గి వచ్చిన యెడల యింటియందన్నియు, మన్నుతోనెట్లు కప్పబడి యుండునో చూడుడు. అట్లే పెక్కు వందలు వేలు సంవత్సరములు గడచిపోయిన నెట్లుండునో యూహింపుడు. సర్వమును యింతలోతు మన్నులో కలిసిపోయి యుండును.

మన నాగరికతయొక్క ప్రస్తుతస్థితి యట్లే యున్నది. మనపూర్వు లమూల్యమైన విషయములను గనిపెట్టి పోయిరి. అయితే అప్పటినుండి వేలకువేలు సంవత్సరములు గడచి పోవుటచే మన నాగరికతయందలి వెలలేనివస్తువులు చెప్ప రాని చెత్తతో కలసి మెలసి పోయియున్నవి. మణులను, మన్నును విడదీయుట సులభము కాని అన్నియు నంత సులభముగ విడిపోవు. పాలు నీరు కలసియున్నప్పుడు వానిని విడదీయుట కష్టసాధ్యము. రాజహంసలకు వానిని విడదీసి పాలను స్వీకరించు శక్తియుండెను. అట్లే మంచిచెడ్డలను, విచక్షణగలవారే విడదీయగలరు కాని లేనియెడల వానిని విడదీయు టసాధ్యము. హిందూమతగ్రంథములలో ననేక సద్విషయములున్నవి. అయితే దేవుడు రాక్షసులకు దగాజేసె ననియు, డబ్బువిషయ మసత్యమాడనచ్చుననియు, భగవంతు డవతరించినపుడు లోకుల భార్యలనందఱిని తనవద్ద జేర్చికొనె ననియు,తననువరించివచ్చిన స్త్రీకిముక్కుకోయించివైచెననియు

బ్రహ్మావిష్ణుమహేశ్వరులు, తమభార్యలోర్వలేమిచేపురికొల్పగా నొక స్త్రీని మానభంగముఁ జేయుటకుసమకట్టిపోయిరనియు, ఎన్నిపాపకృత్యముల జేసినను తీర్థములలో మునుగుటవలనను, గుళ్ళలో పూజలు చేయుటవలనను పోవుననియు, ప్రాణములు విడుచునప్పుడు "నారాయణ"అనిన మాత్రముననే మోక్షము కలుగుననియు, నిట్టి వనేక సంగతులుకూడఁ గన్పడుచున్నవి. అమూల్యమైన అమృతసరోవరములు చెప్పరానిచెత్తతో నిండిపోయినవి. ఇట్టిసంగతులు గూఢార్థభరితములనియు, ప్రత్యేక సందర్భములలో జెప్పబడినవనియు ననవచ్చును కాని కోట్లకుకోట్ల సామాన్య జనులు సామాన్య అర్థములతోనే వానిని గ్రహించుటలేదా ? ఇది పరమ విచారకరము కాని యెడల పరమహాస్యముగ నుండును.

పూర్వమొకరాజు పెద్ద చలువరాతిబండనిచ్చి దానిని మంచి విగ్రహముగ చెక్కుమనెనట. శిల్పి చేతగానివాడు. చేతకాదని చెప్పుకొనుటకు సిగ్గు. తుదకు కొంతకాలమైన వెనుక ఆబండను తిరిగి యారాజునొద్దకు తెచ్చెనట. విగ్రహ మేదియని యడుగగా అద్భుతమైన విగ్రహ మీబండలోపలనే యున్నది. అనవసరమైన పైభాగముల నీబండనుంచి చెక్కి వేసినయెడల లోపల గనబడునని చెప్పెనట! ప్రస్తుతస్థితి యట్లున్నది. ఎట్టి సద్విషయములకైనను శాస్త్రములం దాధారము

లున్నవి. ఎట్టి దుర్మార్గములకు సహితము శాస్త్రములం దాధారములు లేకపోలేదు. నిరుపమములగు వేదములు ఉపనిషత్తులు సామాన్యజనులకందరాని ఫలములైనవి. కనినను కానబడని, వినినను గ్రహింపజాలని వార్తలైనవి. సాధారణముగ జనుల కనుదినచర్యల కలవడుచున్న మతబోధ మంచిచెడ్డలతో మిశ్రమమై పోయియున్నది.

మనపూర్వులు ధర్మమును తెలిసికొను శక్తిగలిగి, యట్లభ్యసించుటవలన పూర్వకాలమున మనదేశమందు దేవతలనోడింపదగిన పురుషులును దేవతలు వరింపదగిన స్త్రీలునుయుండిరి. అట్టి శక్తియు నట్టి అభ్యాసమును పోవుటచేఁ బ్రస్తుతకాలమున మనదేశస్థులు కూలిజాతియని ప్రపంచమునందు పేరు బొందిరి.

తిరిగి మనదేశమున కున్నతదశ, క్షేమము, శక్తి, సౌఖ్యము కల్గవలెనన్న ప్రజలు మంచిచెడ్డలను దామంతట తామే తెలిసికొనజాలవలెను. మంచిచెడ్డలను గురించి ధర్మశాస్త్రము లున్నవిగదా యని యనుకొనగూడదు. ధర్మశాస్త్రములలో నన్నియు నున్నవి. మంచియునున్నది చెడ్డయునున్నది. విడదీయువారెవ్వరు ? భక్తిశ్రద్ధలతోను వినయవిధేయతలతోను సదా మనము చేయునున్న ప్రతి విషయమునుగూర్చి విచారించి వాని మంచి చెడ్డలను మనమే తెలిసికొన

వలెను. ఒకరు చెప్పిరని మూఢభక్తితో నమ్మి చేయరాదు. ఈ గ్రంధము సహా యే గ్రంధములోనైనను వ్రాసియున్న మాత్రమున మూఢభక్తితో నట్లు చేయరాదు.

"వినదగు నెవ్వరు సెప్పిన,
వినినంతనె వేగపడక వివరింపదగున్".

అని చెప్పబడినట్లు, వివరించుట ముఖ్యము. అట్లు వివరించుశక్తియు నభ్యాసమును కలుగవలెననే యీ గ్రంధము యొక్క ముఖ్యోద్దేశము. అట్టిశక్తియు నభ్యాసముకలిగి జనులకు మంచిచెడ్డల జ్ఞానముస్వయముగా కలిగినప్పుడే ప్రస్తుత కాలమున భరతవర్షము తల వంచుకొనునట్లు జేయుచుండు అనంతములగు జాతి, మత, కులభేదములు, లెక్కలేని భేదములన్నియుం బోయి దేశమంతటను మంచిచెడ్డ యను భేదముమాత్ర ముండును.

పైన హిందూమతమును హిందూమత గ్రంధములను గురించి చెప్పినవిషయములే సర్వమతములకు ననువర్తించును. క్రైస్తవు లీగ్రంధమును జదివినయెడలఁ గ్రైస్తవమతమును గురించి యధార్థములను మరింత బాగుగ తెలిసికొనగలరు. బౌద్ధు లీగ్రంధమును జదివినవెనుక బౌద్ధమతమునందలి యధార్థములను మఱింత చక్కగా తెలిసికొనగలరు. ఇట్లే యేమతస్థులైనను నీతియొక్కయు, ధర్మముయొక్కయు, మంచిచెల

యొక్కయు తత్త్వమును తెలిసికొనినయెడల తమ తమ మత ములయొక్క యధార్థములను మఱింత చక్కగా తెలిసి కొనగలరు. అట్టి తత్త్వమును ప్రజలందఱకును తెలియునట్లు సులభశైలిని యీగ్రంథము బోధించును. హిందూమత మన్ని మతములలోను పురాతనమై ఎక్కువవేల సంవత్సరములు గడచిపోవుటచే దానియందెక్కువ దురాచారములు సదా చారములతో కలసిమెలసియున్నవి. అయితే అన్నిమతము లలో సహితము వానివాని స్థాపకు లుద్దేశించిన సదభిప్రాయ ములేగాక యనేక దురభిప్రాయములు కలసిమెలసియుండును.

ఏమతస్థులకైనను ధర్మాధర్మముల, మంచిచెడ్డలవిచ క్షణను బొందుట తమతమ క్షేమశ్రేయములకే ముఖ్యావస రమైయున్నది. అట్టి విచక్షణ గలిగినయెడల మతభేదములు హెచ్చుగ నుండవు. మంచిచెడ్డయనియు, చెడ్డమంచియనియు బోధించు మతము లేదు. ఉన్నను తెలిసినవా రవలంబిం చరు. అట్టి విచక్షణ గలుగుటయే యాలస్యముగాని, విచక్షణ గలిగిన వెనుక మతభేదముల తీవ్రత తగ్గిపోక తప్పదు. అట్టి విచక్షణ, జాతిమత కులభేదములు లేక భారతీయులందఱకును కలుగున ట్లీగ్రంథము తోడ్పడుగాక!

ఆంగ్లేయభాష నభ్యసించుటకు ఆంగ్లేయాక్షరములు, స్పెల్లింగు, ప్రోనన్సియేషన్, ఏక్సెంటు, మొదలైనవనేకములు

మనభాషయందు లేనిచిక్కులున్నవి. అట్టి చిక్కులవల్ల మన పండితు లాభాష నభ్యసించుట దుర్లభమగుచున్నది. ప్రస్తుత కాలమున మనకు తెలియవలసిన శాస్త్రములు మొదలైన విషయము లనేకము లాంగ్లేయ భాషయందే అలవడుచున్నవి. ఆంగ్లేయభాషను మనభాషలో సంస్కృతమును వ్రాసినట్లు వ్రాసిన యెడల పైనఁజెప్పఁబడిన చిక్కులు లేకుండునని చూపుటకై యీ గ్రంథమునందలి భావముల కనుగుణ్యము లగు ఆంగ్లేయకవుల వాక్యముల గొన్ని నచటనచట నాంగ్లేయభాషను తెనుగు లిపితో ముద్రించి యున్నాము. తెనుగులిపితో భాషను నేర్చుకొనిన వెనుక స్పెల్లింగు మొదలైన పైనఁజెప్పిన చిక్కువిషయములు కూడ సులభసాధ్యము లగును. ఆంగ్లేయభాష, హ్యాటు, బూటు, గౌను మొదలైనవి లేక, చీరెగట్టి ఆంధ్రలక్ష్మికి చెలికత్తెగా వచ్చినది. అఱవదాసి వచ్చినట్లు, దానిమాట తెలియక, ముందు ముఖపరిచయము మాత్రమే కలిగినను, పిమ్మట క్రమక్రమముగ నుపయోగించును.

ఏలూరు,
1934.

ఇట్లు,
కో॥ గం॥ బాబురావు.

# విషయసూచిక.



32/

# దైవసహాయము

క. నీయజ్ఞమునకు విఘ్నము
సేయఁగనోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయ పరాక్రముఁడు దాని జేకొని కావన్.

---

రిమ్యూవ్ మై విల్ ఫ్రొం డే టు డే
బ్లెండ్ ఇట్ విత్ దైన్ ఎన్డ్ టేక్ ఎవే
ఆల్ దట్ నౌ మేక్స్ ఇట్ హార్డ్ టు సె
దై విల్ బి డన్.

---

## పూజ — ప్రార్థన — ధ్యానము.

ఈ మూటియొక్క యుపయోగము మనుష్యుల మనస్సునందు తమయందు గురిమాని భగవంతునియందు గురి కలుగుటయే. అట్టి గుణముకలుగనియెడల "భక్తిలేని పూజ పత్రిచేటు" అనునట్లు వీనివల్ల నేమియు ఫలము లేదు. కొందఱు పాప కార్యములను జేయుచునే యుండి తమ పూజలు వగైరాలువల్ల ఆపాపమంతయు పోవుచున్నది అని తలచుచున్నారు. ఇది చాల పొరపాటు.

ఎట్టి కార్యమైనను భగవంతుడుతోడ్పడుటచే జయప్రద మగును. భగవంతునితోడు లేనియెడల యేకార్యమును నెరవేరదు. మన ప్రయత్నములకు భగవంతుడే యజ్ఞపురుషుడైనప్పుడు మనయత్నములకు భంగము రానేరదు. భగవదిచ్ఛకును మన యిచ్ఛలకును భేదము లేకుండునప్పుడే భగవంతుడు మనకు యజ్ఞపురుషుడై మన జన్మమును మన యత్నములను సఫలంబులను జేయును. మనస్సు మారనిదే మోక్షము లేదు.

రాత్రిపోయి పగలు వచ్చునప్పుడును, పగలుపోయి రాత్రివచ్చునప్పుడును యివిసంధ్యకాలములు. సాయంకాలమున పనులుండి సకాలమున సంధ్యావందనము చేయుటకు వీలులేకపోయినను ప్రతిమనుష్యుడును కొంచము చీకటిగా నుండునప్పుడే తెల్లవారుజాముననే నిద్రలేచి కాలకృత్యములైనవెనుక ప్రాతఃకాల సంధ్యావందనమును సకాలమున చేసితీరవలెను. అనేకులు చేయుటయేలేదు. కొందరు సంధ్యకాలమందుకాక భోజనకాలమందు చేయుచున్నారు. సంధ్యావిధానము తెలియనివారు ఓం అను మంత్రమును స్మరించుచు భగవంతుని యందు మనస్సు నిలిపి ధ్యానము చేయవచ్చును. సంధ్యకాలములు పవిత్రములైనవి. ఆ సమయములలోచేయు ధ్యానము శీఘ్రముగా ఫలించి మన మనస్సునందలి అహంభావము మొదలైన దుర్బుద్ధులను తగ్గించి మనస్సులను నిర్మలములగునట్లుచేసి భగవంతునియందు భక్తిని నెలకొల్పును.

# నియమము.

సూర్యుడు ఆకాశమున ప్రాతఃకాలమునందు తూర్పునందుదయించి సాయంకాలమున పశ్చిమమున అస్తమించుచున్నాడు. నక్షత్రములు వానిస్థానములు తప్పక ఆకాశమార్గమునందు సంచరించుచున్నవి. చంద్రుడు తిథులప్రకారము దినదినమును తగ్గుచు హెచ్చుచు ఆకాశమునం దుండవలసిన స్థానమునందు కనుబడుచు సంచరించవలసిన విధమున సంచరించుచున్నాడు. ఒక సంవత్సరమయినను వేయి సంవత్సరములయినను వీని నియమములను అనుసరించి యివి తిరుగుచుండును గాని తప్పవుకద. నియమముల ననుసరించి జీవించవలెనని యివి రాత్రింబవళ్ళును ఆకాశమున వెలుగుచు బోధించుచున్నవి.

ఆకాశముననే కాదు. భూలోకమునచూడుడు. ప్రతివస్తువును ప్రాణమున్నదైనను లేనిదైనను యేదో ఒకపద్ధతిని అనుసరించి యుండును. దేనిపద్ధతిని అదితప్పుకద. ప్రతివస్తువు నియమములకు లోబడియున్నది. దాని నియమముల ననుసరించి అది నడచుకొనుచుండును. నిప్పు పైకే మండుచుండును. నీరు క్రిందికే పారుచుండును. ఏచెట్లకుకాయవలసినపండ్లు ఆచెట్లకే కాయుచుండును. ఏవిత్తనములకు కావలసినమొక్కలు

ఆవిత్తనముల కప్పుచుండును. ఏకాలమున కాపువ్వులు పూయు చుండును. ఏకాలమున కాయలు వచ్చుచుండును. వర్షాకాలములో వర్షములు యెండకాలములో యెండలు, మంచుకాలములో మంచు వచ్చుచుండును. సృష్టియాతయు నియమములకు లోబడియుండి యేగి నడచుకొనవలసిన విధమున నది నడుచుకొనుచుండును.

మనుష్యులు నీతినియమములు లేక అడ్డగోలుగా బ్రతుకవచ్చునుగాని సృష్టియందు దేనినిజూచినను సృష్టికర్త వేయి నోళ్ళతో "నియమము ననుసరించి బ్రతుకుము. నియమము ననుసరించి బ్రతుకుము" అని చెప్పుచున్నాడు. ఇదిమంచి, యిదిచెడుపు అనుజ్ఞానము కలిగినవెనుక మంచిపద్ధతినే అనుసరించి నడుచుకొనవలెను. నిప్పు పైకిమండుచుండుటయు నీరు క్రిందికు పారుచుండుటయు ఒకరినిచూచి జడిసికాదు. చూచువారున్నను లేకపోయినను అవి అట్లేచేయుచుండును. సృష్టియందు సర్వమును దేనిధర్మమును అది అనుసరించి నడచుకొనుచుండును. దీనినే ఆదర్శకముగా పెట్టుకొని మనుష్యులును నియమమును తప్పక సదానడచుకొను చుండవలెను. ఒకరి భయముకొఱకుకాదు. ఇట్లుచేయుట మంచిది, అని తెలిసి నప్పుడు అట్లేచేయుచుండవలెను. ఇహపరములకు శ్రేయస్కరమగును.

ప్రస్తుతకాలమున మన దేశస్థులందఱు జపములు, పూజలు, కార్యములు మొదలైన మతవిషయములలో మాత్రము నియమము తప్పకుండ నడచుకొనుచున్నారు. చేయవలసిన పద్ధతి తప్పకుండ యేదియెట్లుచేయవలెనో అట్లుచేయుచున్నారు. అదే విధముగా సామాన్యమైన వ్యాపారములు వ్యవహారములు చేయునప్పుడుకూడ నియమము తప్పకుండ నడచుకొనుట అభ్యసింపవలెను. ఒకరి భయముకొఱకుకాదు. లాభమునకుచూచికాదు. నష్టమునకు వెఱచికాదు. ఇట్లుచేయుట మన విధాయకము. కాబట్టితప్పక యిట్లుచేయుదము అని అన్నివిషయములలోను ధర్మముతప్పక ప్రవర్తించుచుండవలెను. అట్లుచేయుట వలననే ప్రజలకు శ్రేయస్సును దేశమునకు పూర్వకాలమునందువలె ఖ్యాతియును కలుగును.

---

# నీతి.

సృష్టియందు సర్వమును ప్రాణమున్న వస్తువులును, ప్రాణములేని వస్తువులును, వానివాని నియమములను అనుసరించి నడుచుకొనుచున్నవి. ప్రపంచమునందు అనేక విధముల జంతువులున్నవి. ప్రతిజంతువును కొన్ని గుణములు కలిగి ఆగుణములతో ప్రవర్తించు చుండును. గొడ్లకు

బలము, ఓపిక, మందబుద్ధి, శాంతము నుండును. గాడిద లకు ఓర్పు, పెంకితనము నుండును. పులులకు బలము, క్రూరత్వము, వేటాడు స్వభావము నుండును. కుక్కలకు విశ్వాసము, ప్రేమ, నమ్మకము నుండును. పిల్లులకు చోరబుద్ధి, చురుకుతనము, దేహమును శుభ్రముగానుంచుకొనుబుద్ధి యుండును. దున్నలకు అందము, వేగము, పిరికితనము నుండును. ఈవిధముగా ఫలాని జంతువు అనగనే దానిని చూడనక్కర లేదు. దానికి దానిజాతి ననుసరించి ఫలాని బుద్ధులుండును అని మనము చెప్పగలము. మనుష్యులకు మాత్రము ఫలాని గుణములుండునని చెప్పజాలము. ఒకమనిషికిఅన్నియుమంచిగుణము లుండవచ్చును, ఒకనికి అన్నియు చెడ్డగుణము లుండవచ్చును. చూచుటకు అందఱును మనుష్యులుగా నున్నను వారి వారి గుణములనుబట్టి కొందఱుపులులు, కొందఱు మేకలు, కొందఱు గొడ్లు, కొందఱునక్కలు కొందఱు కోతులు యీ విధముగా మనుష్యులలో అనేకరకము లున్నారు. అయితే జంతువులు వానిగుణములను మార్చుకొన జాలవు. భగవంతుడు యే గుణములతో వాని జాతిని పుట్టించెనో ఆ గుణములతోనుండవలసి నదే. మనుష్యులు మాత్రము వారివారి అభ్యాసమును బట్టి యు, సహవాసమును బట్టియు, యోచనలను బట్టియు యే గుణములనైనను లేనివి పొందవచ్చును, ఉన్నవి పోగొట్టు కొనవచ్చును. మంచిగుణములనుపొంది అభ్యసించుచుండుటయు

చెడుగుణములను విడిచి చెడుతోవలలో పోవలెనని అనిపించి నప్పుడు మనస్సును అట్లు పోనివ్వక కట్టిపెట్టుటయు ఇదియే మనుష్యులకు కర్తవ్యము. మోక్షమార్గము. గుణముల విషయములో యితర జంతువులకులేని స్వతంత్రమును మనుష్యులకు భగవంతు డిచ్చినందులకు మనుష్యుడు సంపాదించవలసిన జన్మఫల మిదియే. అనగా అన్ని చెడుగుణములను విడిచి అన్ని మంచిగుణములను పొంది అభ్యసించు చుండుట.

మంచిగుణము లనగానేమి? ఇది తెలియనివారెవరున్నారు. తెలిసియు చేయనివారేకాని తెలియక చెడిపోయిన వారు లేరు. ప్రపంచము పుట్టి అనేక లక్షల సంవత్సరములు జరిగిపోయినవి మనుష్యజాతిలో అనేక లక్షల తరములు గడచిపోయినవి. ఒక్కొక తరము వారును వారి అనుభవమువల్ల యీగుణములను అభ్యసించుటవల్ల మేలుకలుగును, యీ గుణములను అభ్యసించుటవల్ల కీడుకలుగును అని తెలిసికొని పిమ్మట వచ్చువారికి మార్గము చూపించి యున్నారు. పెద్దలు చెప్పిన నీతిమార్గము మనము అభ్యసించుట పెద్దల అనుభవముచే మనము బాగుపడుటయే. బుద్ధిమంతుడు యితరుల అనుభవమువల్ల బాగుపడును. మధ్యముడుతానే అనుభవించినగాని బాగుపడడు. బుద్ధిహీనుడు తానే అనుభవించినను బాగుపడడు. ప్రతిమనిషికి ప్రపంచము క్రొత్తఅయినను పూర్వులు లక్షలకు లక్షలమంది తరతరములుగా ప్రపంచమునందు పుట్టి పెరిగి

చనిపోయినారు. వారి అనుభవమువల్ల ప్రపంచమునందు యీ విధముగా ప్రవర్తించుచుండుట మనుష్యులకు శ్రేయస్కరము అని తెలిసికొని చెప్పిపోయియున్నారు. ఇదియే నీతిమార్గము. పూర్వపుమనుష్యుల అనుభవముచే ప్రస్తుతపు మనుష్యులకు సుఖపడు మార్గము తెలుపుటకై యేర్పడి యున్నది.

సృష్టియందలి సర్వవస్తువులును వాని వాని నియమములను అనుసరించి నడచుకొనుచున్నవి. జంతువులు యే గుణములతో నడచుకొనవలెనో భగవంతుడు ఆపుట్టినప్పుడే ఆగుణములతో పుట్టించి యున్నాడు. మనుష్యులకుండవలసిన నియమములు కొన్నియున్నవి. ఇవియేమంచిగుణములు. వీనిని అభ్యసించుటయే నీతిమార్గము. ఆ నియమములను అనుసరించి నడచిన యెడల సుఖపడుదురు. జన్మము సాఫల్యమగును. లేనియెడల దుఃఖముల పాలగుదురు. జీవితము అనర్థమగును.

ఏ జంతువైనను తనకుండుగుణములు మంచివా చెడ్డవా అని యోచింప నక్కరలేదు. దాని జీవనమునకు అవసరమైన గుణములతో దానిని భగవంతుడుసృష్టించెను. దానికుండుగుణములలో కొన్నిమంచివి అనుటకును వీలులేదు. కొన్ని చెడ్డవి అనుటకును వీలులేదు. దాని జీవనమునకు దానికుండుగుణములన్నియు అవసరమే. ఆ రకము జంతువు లన్నిటికిని ఆగుణములే యుండును. మనుష్యులలో మాత్రమట్లుకాదు. ఇవి యుండవలసిన గుణములు ఇవి యుండకూడని గుణములు

అని తారతమ్యమున్నది. ఉండవలసిన గుణములు సద్గుణములు; వానిని అభ్యసించుట నీతిమార్గము. సన్మార్గము. ఉండకూడని గుణములు దుర్గుణములు. వానిని, అభ్యసించుట దుర్మార్గము.

ప్రతిమనిషిముందును దారిచీలి రెండు మార్గములుగా పోవుచున్నది. సన్మార్గముయిరుకుతోవ, దానిని తొక్కుచు పోవుట కష్టముగాని అది సుఖమునకును జయమునకును జన్మ సార్థకతకును కొనిపోవును. దుర్మార్గము వెడల్పు బాటగా నుండును దానిని తొక్కుకొనుచు పోవుట సులభముగా నుండును. కాని అది తుదకు దుఃఖమునకును అశాంతికిని అనర్థమునకును కొనిపోవును.

నోరులేని జంతువులును, చలనములేనిచెట్లును, ప్రాణములేని వస్తువులును సృష్టియందలి సర్వమును వానివాని నియమముల ననుసరించి దేనికుండవలసిన గుణములతో అదియుండుచు యెట్లు నడచుకొనవలెనో అట్లు నడచుకొనుచుండగా మనుష్యులు మాత్రము వారి కుండవలసిన గుణములను విడిచినడచుకొనిన యడల దుఃఖపడక తప్పునా? అందువలననే ఇదివరలో ప్రపంచమునందు నివసించిపోయినవారు అనేక లక్షల తరములవారు తమ అనుభవమును బట్టి "మనుష్యుల కుండవలసిన గుణములు ఇవి. మనుష్యులకు నీతిమార్గ మిది. మనుష్యులు తమ ధర్మములను విడచిన యడల దుఃఖపాత్రులగుదురు" అని హెచ్చరించిపోయి యున్నారు.

ధర్మంబు చెఱుప చెఱచును
ధర్మము రక్షించువారి దారక్షించున్
ధర్మంబు చెడక యెప్పుడు
నిర్మలమతి నడుపవలయు నిశ్చలనియతిన్

మనుష్యులు మతభేదములు కారణములుగా నుంచుకొని ఘోరముగ పోరాడుచుందురు అయితే మనుష్యుల కుండవలసిన మంచిగుణములేవి మనుష్యులుతొక్కవలసిన నీతిమార్గమేది అని అడుగగా అన్నిమతముల గురువులును ఒకేవిధముగా చెప్పుచున్నారు

---

ధర్మమును ఆచరించుట,
ధర్మమును కాపాడుట.



నీతిమార్గమును మనుష్యుల అనుభవమువల్ల మనుష్యుల సౌఖ్యము కొరకును క్షేమము కొరకును యేర్పడి యున్నది అని చెప్పియున్నాను. అయితే దీనివిషయమై కొందఱకు సందేహము కలుగవచ్చును. ఇది లోకమునకు విరుద్ధముగా నున్నదని కొందఱుఅనవచ్చును. దుర్మార్గులు ధనసంపదలుకలిగి హాయిగా నుండుటలేదా ! సజ్జనులు అనేక కష్టముల పాలగుటలేదా ! నీతిని విడువకుండుట వలననేకద హరిశ్చంద్రునకనేక కష్టములు

వచ్చెను. దశరథుడు పుత్రశోకముచే మృతుడయ్యెను. రామలక్ష్మణులును సీతయు నరణ్యములకు పోవలసివచ్చెను. పంచపాండవులు అరణ్యవాసమును అజ్ఞాతవాసమును చేయువలసి వచ్చెను. నీతిమార్గముచే జనులకు సౌఖ్యమును క్షేమమును కలుగునని యెట్లు చెప్పవచ్చును. అని అనేకులు సందేహపడవచ్చును.

ఒక దృష్టాంతమువల్ల సంగతి బోధపడును. ఒక మనుష్యుడు యీ విధముగా ఆలోచన చేయవచ్చును. " అనేక రోజులు కష్టపడి యేలసంపాదించవలెను. కష్టపడి సంపాదించకయే ఒకరివద్దనున్న దానిని తీసుకొనకూడదా? " ఇట్లు తలచి, అట్లేచేసిన యెడల ఆ సమయమునకు అది బాగుగ నుండవచ్చును. అయితే యితరు లందఱు అట్లే చేసినయెడల ఆ మనుష్యుని గతియేమి కావలెను ? నీతిమార్గమును అభ్యసించుటయే అందఱకును క్షేమకరమని తెలియుచున్నది కదా.

ఒక గ్రామములో 100 మంది మనుష్యులుండి అందఱును నీతిగా నుండినయెడల ప్రతిమనుష్యునకును 99 మంది స్నేహితులుందురు. ఆ గ్రామము స్వర్గమువలె నుండును. అందఱును నీతిలేక ప్రవర్తించినయెడల ప్రతి మనుష్యునకును 99 మంది విరోధులుందురు. ఆగ్రామము నరకమువలెనుండును

నీతి లేక ప్రవర్తించుట ఒకనికి తాత్కాలికముగా లాభకరముగా నుండవచ్చును గాని దానివల్ల సంఘబలము తగ్గిపోవును. ప్రజాక్షేమము తగ్గిపోవును. ప్రజాక్షేమముతగ్గిపోవుట చేత చివరకు ఆమనుష్యుని క్షేమముకూడ తగ్గిపోవును: నీతిగా ప్రవర్తించుట వల్ల ఆ సమయమునకు నష్టము కష్టము కలుగవచ్చును గాని సంఘబలమును ప్రజలక్షేమమును వృద్ధియగును తుదకు ఆ మనుష్యునకు సహితము మేలు కలుగును.

నీటిలో చేపలు ఎట్లు బ్రతుకుచున్నది తెలియునుగద. పంచదార వ్రగిరాలు నీటిలో కరుగువల్లె గాలి కూడ నీటిలో కరిగి యుండును. అట్లు కరిగి యుండు గాలివల్ల బ్రతుకుచున్నవి. నీటిని కళపెళ కాచిన యెడల దానియందు కరిగియుండు గాలి యంతయు పోవును. గాలి లేని నీటిలో చేపలు బ్రతుకలేవు. ప్రతి చేపయు తన సుఖముకొరకు యేమి చేసినను చేయవచ్చును గాని నీటిలో గాలి పోవునట్లు చేయుట మాత్రము తెలివి తక్కువగద. సంఘమునకు నీతి గాలివంటిది. ప్రజలలో నీతి యెక్కువగా నున్నకొలదిని వారి జీవితములు సౌఖ్యముగ నుండును. వారియందు నీతి తగ్గిపోయినకొలదిని వారి జీవితములు కష్టముల పాలగుచుండును. నీతిమార్గముగ ప్రవర్తించునప్పుడు ప్రతిమనుష్యునకును కష్టనష్టములు రావచ్చును. గాని సంఘమునందలి నీతిని నిలిపి అభివృద్ధిచేసినవారై ప్రజాక్షేమమునకును సంఘబలమునకును

తోడుపడిన వాడగును. అట్లే దుర్మార్గుడు నీతిని తప్పి నడుచుకొనుచున్నను తనకు ఆ సమయమున లాభము కలిగినను సంఘమునందు నీతితగ్గిపోయి ప్రజాక్షేమమునకు భంగము కలుగునట్లు చేసినవాడగును.

కాబట్టి నీతిమార్గము ప్రజాక్షేమకరమని చెప్పగా సంఘమునకు అని అర్థముగాని ప్రతిమనుష్యునకు అని అర్థము కాదు. సంఘబలము తగ్గిపోవుటచే మనుష్యులకు యెట్టిహీనస్థితి కలుగగలదో మనదేశపు ప్రస్తుతస్థితివల్లనే తెలియగలము కదా. పూర్వకాలమునందు మనదేశస్థులు నీతిగలిగి యుండిరనియు సత్యవంతులనియు యితర దేశముల గ్రంథకర్తలే వ్రాసియున్నారు. అప్పుడు మనదేశము గొప్పగను సౌఖ్యముగను సంపద గలిగియు నుండెను. ఇప్పుడు నీతితగ్గిపోయి యుండుటచేత నమ్మకముగా తయారైన వస్తువులు కావలెనన్న యితర దేశములనుండి తెప్పించుకొనవలసియున్నది. మన చంటి పిల్లలకు పాలుకూడ 5000 వేలమైళ్ళ దూరమునుంచి డబ్బాలలో బిగించి తెప్పించవలసి వచ్చుచున్నది. నమ్మకముగా పనిచేయు మనుష్యులు కావలెనన్న దూరదేశముల నుండియే పిలిపించుకొనవలసి వచ్చుచున్నది. సామాన్యవ్యాపారవిషయములలోను వ్యవహార విషయములలోను నమ్మకము తగ్గిపోయి యెవరును కలసి యేపనులుచేయుటకుగాని చేయించుటకుగాని వీలుండుట లేదు. అందఱకును జీవనములు తగ్గిపోయి అందఱును దుర్దశను

కలిగి దేశమంతయును పూర్వకాలమందు యెంతగొప్పతనమును ఐశ్వర్యమును కలిగియుండెనో యిప్పుడు అంత దారిద్ర్యమును అనుభవించుచున్నది.

మన పూర్వులు నీతిగలవారైయుండిరి. "జీవధనములైన జెడుగాక పడుగాక మాటదిరుగ లేరుమానధనులు" అనుచు, అట్లే ప్రవర్తించుటకు వారు తెలివి తక్కువవారా ? ఒక అబద్ధము పలికి హాయిగానుండ లేకయా ? నీతి తప్పుటవల్ల ఆసమయము నకు ఏమిసుఖము కలిగిననను తుదకు ప్రజలందఱకును అనర్థముకలుగును, అందఱకును కీడుకలుగును అని గ్రహించి గొప్ప బుద్ధితో తమ కష్టమును లక్ష్యము చేయక నీతిమార్గమును విడువక ప్రజాక్షేమమును కాపాడిరి.

మనక్షేమమును ఎట్లు చూచుకొనుచున్నామో యిత రుల క్షేమమును కూడనట్లే చూచుచుండవలెను.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తనమనంబునకగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్.

ఎదుటవారి కష్టసుఖములను చూచి[illegible]కొనుటయే అన్నిధర్మములకునుసారము. పరోపకారార్థమై [illegible] ప్రాణము లను సహితము యిచ్చివేసినవారు లేరా? అయితే అం[illegible]

ముగా ధర్మమార్గమును త్రొక్కుట అందఱకును సాధ్యము కాకపోయినను, నీతియందు దృష్టికలిగి నీతిగా ప్రవర్తించుట వల్ల కొంతకష్టనష్టములు కలిగినను వానికి ఓర్చుకొని అందఱును కొంచెమే నీతిగా నుండినను ప్రజలక్షేమము యెంతయో వృద్ధియగును. మీకు నష్టములేక కాని, స్వల్పనష్టమేకాని యుండు విషయములలో నైనను ప్రజలక్షేమమును గమనించి ప్రవర్తించుడు. అందఱునుకొంచెము కొంచెము శ్రమపడినవారమైనను మొత్తముమీద మన దేశమునకు చాలమేలుకలుగును.

దేశక్షేమమునకు ధర్మప్రవర్తన మిక్కిలి ముఖ్యమైనది. ప్రతి మనిషియు తాను ధర్మమార్గమున నడుచుటయే గాక ప్రజలలోకూడ ధర్మము నిలుచునట్లు ప్రయత్నించవలెను. ఇట్లు చేయుటకు ప్రతి మనిషియు తన విషయములో నెట్లు ప్రవర్తించవలెను. ఇతరుల విషయములోనెట్లు ప్రవర్తించవలెను ?

తన విషయములో నెట్లు ప్రవర్తించవలెను. ప్రతిమనిషియు బలము, తెలివి, మెలకువ మొదలైన గుణములను తనయందు వృద్ధిచేసుకొనవలెను. బలహీనుడుగానున్న యెడల బలవంతులను దుష్టకార్యములకు పురికొల్పుటయే. తెలివితక్కువగా నున్నయెడల దగాచేయమని బ్రతిమాలుకొన్నట్లే. దుష్టులును దగాచేయువారును నరకమునకు పోదురుగదా అనుకొని తృప్తిపొంది యుండకూడదు. దుష్టత్వమునకును, దగాకు న

ప్రోత్సాహకుఁడగును. దానివల్ల హాని చేయువారికే కాదు. అందఱికిని కష్టమే. అనేకులు మేము పలానివారిని నమ్మి వారి వల్ల మోసపోయినాము అని చెప్పుకొనగా వినియున్నాము. ఎంత బంధువు లైనను, మిత్రు లైనను మంచి వారైనను వ్యవహార పద్ధతులు వ్యవహార రీతిగా చేయవలెను. తిరిగి పోవుటకును మోసము చేయుటకును వీలు లేకుండు నట్లు చేయవలెను. మోసమున కవకాశ మునచకూడదు. మఱియు మనుష్యులయందు మెత్తదన ముండగూడదు. మెత్తని వానిని ఒత్తబుద్ధిఅపుచుండునట అధర్మమునకు కారణమగును.

ఇతరుల విషయములో నెల్లు ప్రవర్తించవలెను. ఎక్కడ యెప్పుడు అధర్మమును చూచినను కష్టపడువారు కష్టపడి పోదురుగాక, మనకేమి పట్టినదని యుపేక్ష జేయక మనశ్శక్తి కొలదిని అడ్డపడవలెను. పదిమంది మనకు తోడువత్తురా లేదా అని ఆలోచింపకూడదు. దేవుడున్నాడు మనమున్నాము. మన ధర్మము మనము చేయవలెను. అనేక విషయములలో ఎక్కువ అపాయముండదు. ఎవరికివారు నోరుమూసుకొని యూరకుండక "అయ్యా, ఈపని మంచిది కాదు ఇట్లు చేయుట తప్పు" అని నోటితో అనినతోడనే అధర్మము చేయువారి యుత్సాహము సగము తగ్గిపోవును ప్రజాభిప్రాయముని యొకటున్నదికద.

ఇతరుల క్షేమముపై దృష్టితప్పి యెవరికివారు తమక్షేమమునే గమనించుట మొదలు పెట్టినప్పుడే మనదేశము యొక్క గొప్పస్థితి పోయినది. భగవంతుడు తిరిగి మనదృష్టిని మార్చి యెవరిసంగతివారు చూచుకొనుటయేగాక ప్రజలక్షేమముపై దృష్టికలుగునట్లును, దేశమునందు నీతి వృద్ధికలిగి తిరిగి మన దేశమునకు గొప్పదశ వచ్చునట్లును ప్రసాదించుగాక.

---

పాలింపుము శేముషి
నున్మూలింపుము కర్మబంధముల సమదృష్టిన్
జాలింపుము సంసారము
కీలింపుము హృదయమునను కేశవభక్తిన్.

## చాలింపుము సంసారము.

సంసారమును చాలింపుము అనగా అందరును ఇండ్లు వాకిళ్ళు వదలిపెట్టి అడవులలోనికి పోవలెననియా? కాదు. నేను, నాది అను అహంభావముతో నుండకూడదు, తాను సంపాదించునదంతయు లోకోపకారమునకే గాని తనకొఱకును తన కుటుంబముకొఱకు అనుకొనకూడదు. ఒక ధనవంతునకు పొలములు కొల్లలుగా పండగా క్రొత్తగాదెలను కట్టి ఏ సింహ

పోసి "ఆహా ఇక యెన్ని యేండ్లకైనా ఫరవాలేదు. హాయిగా నిద్రించెదము" అని, అనుకొనెనట. భగవంతుడు మాత్రము "ఓరి పిచ్చివాడా అన్నియు చూచుకొంటివిగాని నీ ఆయుస్సు తక్కువని" అనెనట. ఆ రాత్రియే వాడు పరలోకగతుడయ్యెను. ఎల్లప్పుడు తన సుఖము, తన దుఃఖము, తన మంచి, తన చెలువు తలచుకొనుచుండుట — యిదియే నరకము, పరమ దుఃఖకారణము; యెల్లప్పుడు యితరుల కష్టసుఖములను విచారించుచు తన శక్తికొలది లోకోపకారము జేయుట — ఇదియే సుఖదాయకము.

జరయు మృతియులేని జనునట్లు, ప్రాజ్ఞుండు
ధనము విద్యగూర్ప దలప వలయు
ధర్మమాచరింప దగు, మృత్యుచేతుల
పట్టియీడ్వబడినవాడు పోలె.

మనుష్యులు వృద్ధాప్యము, చావు, లేనివారివలె ధనమును విద్యను చేర్చవలెనట. ఎందుకు? పరోపకారార్థమే. ఒక మనిషి యొక్క శరీరము యెంతమాత్రమైనది. ఒక్క తన శరీరమునకు కావలసినది యెంత. అట్లుండగా జరయు మృతియు లేనివారివలె ధనమును చేర్చుమని నీతిశాస్త్రము యెందుకు చెప్పుచున్నది. లోకోపకారార్థమేకద! మన చేతులార యిచ్చినను సరే మనము పోయిన వెనుక లోకులు పంచుకొన్ననుసరే

మనము ఉండగానే తలగొట్టి తీసుకొన్నను సరే. మనశరీరమునకు మాత్రము మనము ఖర్చుపెట్టగలిగినది స్వల్పమే. మన శక్తిచే యెక్కువగా చేర్చిపెట్టినను అందులో యెక్కువ భాగము ఇతరులు తినవలసినదే. తప్పదు. ఇది నీతివిషయము కాదు. ఉన్నసంగతి. ఈవిషయమును గ్రహించుకొని మన స్ఫూర్తిగా భగవంతునికి అర్పించు భావముతో పరోపకారమునకై పాటుబడి, ఆర్జించుచు మన శక్తికొలది యిచ్చుచుండుటయే సర్వధర్మములకును మూలము; ఎల్లప్పుడును తనకే కీర్తి, అధికారము, ధనము మొదలైనవి యుండవలెనని పాటుబడుటయే అన్ని అధర్మములకు మూలము ఎట్లయినను మనుజుడు వీనిని పొందుటకే ఎడతెగని ప్రయత్నములను చేయుచునే యుండవలెను. అయితే భేదమేమి. ఒక విషయములో అంతా తనకొరకే అని ప్రయత్నించుచుండును. ఒక విషయములో అంతయు నితరుల కొరకే అని గ్రహించి ప్రయత్నించుచుండును. ధర్మబుద్ధికలిగి యితరుల కొఱకని గ్రహించినవాడు సన్మార్గములుచేసి సంపాదించును. తాను ప్రయత్నము చేసి దానిని పొందజాలకపోయినను స్వలాభమునకు పాటుపడువానివలె యొకటివారిపై వైరముపూని కక్షవహింపడు. ఇదియే భేదము

మన మతములో సంగతులు మనకు తెలియును. కాని ఆప్రకారము ఆచరణ చేయువారు మాత్రము ఆంగ్లే

యులు వారికి కొన్ని దురభ్యాసములు దుర్గుణాలు ఉన్నవి. అయితే దేశక్షేమమునకై పాటు పడుటను పూర్తిగా అభ్యసించుచున్నారు. యెన్నివేల మైళ్ళ దూరములో నున్నను సరే, ఒకపని యిట్లు చేయుదము అని ఒప్పుకొని వెళ్ళినయెడల అట్లు చేయుదురు. పైన చూచెడివారు ఉన్నను లేకపోయినను నిర్బంధించువారు ఉన్నను లేకపోయినను, ఇది మనము చేయవలసినపని అని వారంతట వారే చేయుదురు. దీనినే వారి భాషలో డ్యూటి (duty) అందురు. అనగా యెవరు చేయవలసినపని వారు చేయుట. ఇదిగాక వారిలో యెంత ధనవంతులైనను సోమరితనముగా నూరకకూర్చుండి తినుచుండక పూర్తిగా లేనివారివలనే పాటుపడి వీలయినంత ఆర్జించి తమ దేశమునకు తోడుపడుచుందురు. "ఉద్యోగం పురుషలక్షణం" అనియు "జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ" అనియు మనలోను ఉన్నవి. అయితే మనము మాటలతో ఆగియున్నాము. వారు క్రియలో సహితము ఆచరించుచున్నారు. వారిలో చిన్నపిల్లలకు

"ల్యాండ్ ఆఫ్ అవర్ బర్త్, వి ప్లెడ్జ్ టు ది
అవర్ హోప్స్ ఎండ్ టాయిల్ ఇన్ యియర్స్ టు బి"

అనగా "ఓ దేశమాతా! ముందు మా శక్తి అంతయు నీకే అర్పించుచున్నాము" అనే భావము గల పద్యములను నేర్పుచున్నారు. ఆ పిల్లలు పెద్దలయిన వెనక వారి నడవడియు దానికి తగినట్లే యుండుచున్నవి.

ప్రపంచ మునందలి విషయ వస్తువులందు మనస్సు తగిలి యుండకూడదను అనియు ఫలమున కపేక్షించకయే పాటుపడు చుండుట ధర్మమనియు మన శాస్త్రగ్రంథముల బోధ. ఇది అందఱకును తెలిసినదియే అందఱకు తెలియుటవల్లనే అందఱకు నిర్లక్ష్యము అయినదో యేమో. ఈ రోజులలో దేశము నందంతటను విషయాసక్తి హెచ్చయిపోవుచున్నది. డబ్బు పిచ్చిఅనగా యిదే. "మెరుగు బంగారంబు మ్రింగబోరు" అని కవి వ్రాసినట్లు బంగారమును యెవరును తినలేరు. అయితే బంగారముతో సర్వ విషయ భోగములను గొనవచ్చును. ప్రపంచము నందలి విషయమువస్తువులు, కీర్తి, అధికారము మొదలైన వానియందు భోగాపేక్షగలిగి మనస్సు వానియందు తగుల్కొని వానిని పొందుటకు ధనమే ప్రధానముగా ప్రవర్తించునదే డబ్బు పిచ్చి. కుక్కలకు పిచ్చిపట్టిన యెడల మందు లేనట్లే డబ్బు పిచ్చి పట్టినయెడల మందు లేదు. ఇందువల్లనే ఒక మత గురువు యిట్లు చెప్పెను.

"ఇట్ ఇజ్ ఈజియర్ ఫార్ ఎ క్యామెల్ టు ప్యాస్ తు ఎ నీడిల్స్ ఐ ద్యాన్ ఫార్ ది మ్యాన్ ఆఫ్ రిచస్ టు ఎంటర్ ది కింగ్డం అఫ్ గాడ్." అనగా ఒక సూదిరంధ్రములోనుంచి ఒకఒంటె పోవచ్చునుగాని ధనాపేక్షితులు స్వర్గ ద్వారములోపల పోజాలరు అని అర్థము.

నీతిమార్గము పరలోకమునకేగాక ఇహలోకమునకును ముఖ్యము. నీతిమార్గము అభ్యసించుటచేతనే యితర దేశస్థులు ఉన్నతదశను అనుభవించుచున్నారు.

---

# దేశక్షేమము.

మన దేశమును యితర దేశముల వారు వచ్చి ఆక్రమించుకొనకుండా మన ప్రభుత్వమువారు సేనయున్ను యుద్ధ నావలున్ను యేర్పాటుచేసి యున్నారు. మన ప్రభుత్వమువారే కాక ప్రపంచమునందున్న అన్ని దేశముల ప్రభుత్వమువారున్ను యిదే ప్రకారముగా యుద్ధమునకు సిద్ధముగా యుండుటకు సేనలు యేర్పాటు చేసుకొనియున్నారు. ఇట్టి యేర్పాటు చేసికొన లేని దేశములను ఇతర దేశములు నిమిషములో ఆక్రమించుకొని నష్టపరచును. వీనిని యేర్పాటు చేయుటకున్నూ, దేశములోపల అల్లకల్లోలములు లేకుండా శాంతముగా నుండుటకు దేశము వృద్ధి పొందుటకు యేర్పాటుచేసిన పోలీసు, టపా, టెలిగ్రాఫు, న్యాయశాఖ విద్యాశాఖ, వైద్యశాఖ మొదలైన అనేక డిపార్టుమెంటులకున్నూ, సర్కారువారు ప్రతిసంవత్సరమున్నూ అనేక కోట్ల రూపాయలను ప్రజలపై పన్నులువేసి వసూలుచేసి ఖర్చుపెట్టవలసియున్నది.

పూర్వకాలములో ఒక దేశములో ఒక రాజు ఉండి ప్రభుత్వమును అంతా ఆరాజు తన యిష్టప్రకారము నడుపుచుండెను. ఈరోజులలో అంతకంటె మంచి పద్ధతినికనిపెట్టినారు. అనేక దేశములలో ఒక రాజు రాజ్యముచేయుట లేకుండా ప్రజలందఱుకలిసి రాజ్యము చేసుకొనుచున్నారు. వారివారి కష్టసుఖములు వారికే బాగా తెలియును కాబట్టి వారి యిష్టప్రకారము వారేరాజ్యము చేసుకొనుచున్నారు. ఇప్పుడు బ్రిటీషుదీవులలో ప్రజలరాజ్యమే జరుగుచున్నది. రాజుగారు ఉన్నప్పటికి ఆయన ప్రజల సభ అభిప్రాయము ప్రకారమే అన్ని పనులు చేయుచుండును. బ్రిటిషువారికి మన దేశస్థులకుకూడా ప్రజారాజ్యము పద్ధతిని నేర్పవలెనని యిష్టమున్నది. అందువల్లనే మనదేశములో స్వదేశరాజులు రాజ్యముచేయు చోట్లలోగాక ఇంగ్లీషువారు ప్రభుత్వముచేసే అన్ని చోట్లలోను యూనియన్లు. మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు, జిల్లా బోర్డులు; శాసన సభలు ఇటువంటివి అన్నియు సర్కారువారు పెట్టియున్నారు. వీటికి కొంత అధికారములు యిచ్చియున్నారు. వీటికని బాగా జరుగుతే యింకా యెక్కువగా అధికారములనిచ్చి మనదేశములో పూర్తిగా ప్రజారాజ్యముగా చేయవలెననే అభిప్రాయమును వారు కలిగియున్నారు.

ప్రజారాజ్యము అనగా అందఱు ప్రజలు రాజ్యముచేయుటకు వీలులేదు. వోట్లుపద్ధతిని పెట్టుకొని ప్రజలు కొందఱు

ప్రతినిధులను యెన్నుకొనెదరు. ఇదే ఎలెక్షను అనబడును ఈప్రతినిధులు ఒక సభచేసి రాబోవు సంవత్సరములో యేమి పన్నులు వేసుకొనెదము. యేమి ఖర్చులుపెట్టుకొనెదము అని ఒక జమాఖర్చు పట్టి తయారుచేయుదురు. దీనిపేరు బడ్జెటు అనబడును. అదే ప్రకారముగా పన్నులు వేయబడి సొమ్ము వసూలు చేయబడును, వసూలు చేయబడిన సొమ్ము అదే ప్రకారముగా ఖర్చుపెట్టబడును. ఈ సభలోనే కేసులు, లా, యేర్పాటు చేయబడును. సర్కారు పని యావత్తున్నూ ఒక మనిషి యిష్టప్రకారము గాక ఈ రూల్సు ప్రకారము, లా ప్రకారము జరుపబడును.

ప్రజల రాజ్యము బాగుగాజరుగుటకు అందుకు జాతి అభిమానము, కులాభిమానము తగ్గి స్థలాభిమానము హెచ్చుగా నుండవలెను. ఇది మనగ్రామము, మనవూరు, మన తాలూకా మనజిల్లా మనదేశము, ఇక్కడ అన్నిపనులు బాగుగా జరుగవలెను. అన్నివీధ్యు బాగుగానుండవలెను. ఇక్కడప్రజలందఱు క్షేమముగా నుండవలెను. అని యీ ప్రకారముగా ప్రజలకు తోచవలెను. వోట్లు ఉన్నవారు సరియైన ప్రతినిధులను ఎన్నుకొనినారు తమ తరపున బాగుగాపని చేయుచున్నారా లేదాఅని చూచుచుండవలెను అందఱును తమక్షేమముకొఱకు తాము పాటుపడుచున్నారు. అదేప్రకారముగా ప్రజలక్షేమము కొఱకు పాటుపడుట నేర్చుకొనవలెను. ప్రజలకు కావలసి

పనులు ఇతరులువచ్చి చేసిపెట్టెదరు అని తలచకూడదు. ప్రజలకు కావలసిన పనులు ప్రజలే చేసుకొను అభ్యాసము కలుగవలెను. ఎలెక్షనులు ప్రజాసేవకొఱకేగాని తాముకీర్తి పొందుటకు పేరుపొందుటకు ఏర్పాటు చేసినారు అని అనుకొనక ఎలెక్షనులలో ఓడిపోయినవారుకూడా గెలిచిన వారిమీద కక్షలు పడకుండా తమతమ శక్తికొలది సభలలో లేకపోయినను ప్రజలకొఱకే పాటుపడుచుండవలెను. ప్రజలు కక్షలుపడుట ఒకరితో ఒకరు పోట్లాడుకొనుట మానివేసి అందఱుకలసి అందరిక్షేమము కొఱకు పాటుపడుట నేర్చుకొనవలెను. మనుష్యులకు శత్రువులు మనుష్యులు కారు. అందఱను కష్టపెట్టుచున్న అవిద్య, అనారోగ్యము, దారిద్ర్యము, మొదలైనవే అందఱకును శత్రువులు. అందఱుకలసి వాటితో పోరాడవలెను. పైవిషయములను అందఱును గమనించి అభ్యసించిన యెడల మనప్రభుత్వము వారు ప్రజారాజ్యమును శీఘ్రముగా వృద్ధిచేయుటకు వీలగును. ప్రజలకు చాలాక్షేమము కలుగును. వెనుక పువ్వులు మొలచినచోట యిప్పుడు గడ్డి మొలచుచున్నది. ఇప్పుడు గడ్డి మొలచుచున్నచోట తిరిగి పువ్వులు మొలచును.

శ్రీ వేమన గ్రంథాలయము,

# మానవసేవ.



మానవకోటికి సేవజేయుటయే భగవంతునికి సేవ చేయుట. అడవులలోనుండు జంతువులవలెనే మనుష్యులలో సహితము కొందఱుబలవంతులు, కొందఱుదుర్బలులు, కొందఱు అకిరటులు, కొందఱు ప్రాజ్ఞులు, కొందఱు విమతుల్యులు ఇట్లు అనేక విధములుగా నున్నను భగవంతునికి చేయవలసినట్లు మానవకోటికి సేవచేయవలెను. మనుష్యులను జూచికాదు. భగవదర్పితముగా మానవసేవ జేయవలసియున్నది. భగవంతుడు మానవకోటి రూపముగా మనకొఱకు కనబడుచున్నాడనియు, వేఱురూపముగా యీ జన్మములో మనకగుపడకనియు మనము నెన్నవలసియున్నది. పరోపకారము శ్రేష్ఠమని చెప్పుటకు ఇదియే కారణము.

ఒక మనుష్యుని శక్తి స్వల్పము. ఒకనివద్ద కొంచెము నీరుండినయెడల నది దేశమంతయు వ్యాపింపవలెనని క్రింద పోసినయెడలనెందుకును పనికిరాక చెడిపోవునట్లు అనంతమైన మానవకోటికి యావత్తునకును ఉపకారము చేయవలెనన్న ఒక మనుష్యుడు ఏమియు చేయజాలక పోవచ్చును. అందువల్లనే మనుష్యులందు జాతులు, తెగలు, కులములు, ఖండములు, దేశములు అని అనేకపక్షములు ఏర్పడియున్నవి. ఒకపక్ష.

ములో నొక్కొక్క రకమువారు కక్షలు, పార్టీలు కడి తలలు బద్దలు కొట్టుకొనుటకుగాదు. తనశక్తి సామర్థ్యములను బట్టి ఒకమనుష్యుడు తనకుటుంబమునకును, లేక తనజాతికిని, లేక తన దేశమంతటికిని, లేక ప్రపంచమంతటికిని సేవ చేసి యుపకారము చేయునప్పుడు. తన తెగకు సహాయము చేయవలెనన్న యితర తెగలకు ద్రోహము చేయవలెనని కాదు. తన దేశమునకు సహాయము చేయుట అనగా ఇతర దేశములకు ద్రోహము చేయవలెనని కాదు. ఒక యింట్లో ఒక్కొక్క శాఖవారు ఒక్కొక్క గదిలో కాపురముండవచ్చును. సహజముగా అనగా ప్రతిమనుష్యునకును తనదగ్గర వారిపై యెక్కువ ప్రేమయుండును. ఉండినను తనయింటిలో యితర శాఖల వారిపై కూడ ప్రేమయుండునే గాని ఒకరొకరి కొకరికి ద్రోహము చేయవలెనని సాధారణముగా తలచుచుండరు.

మనదేశమునందు అనేకజాతులు, కులములు నున్నవి. పై సంగతిని గ్రహింపక పోవుటచేతనే వానియందు యెక్కువ అధిక కక్షలు పడుటయు, ఒక తెగవారు ఒక తెగవారిపై సవారి చేయవలెనని ప్రయత్నించుటయు జరుగుచున్నది. అందఱును, భగవంతుడు అందఱియందును ఉన్నాడని జ్ఞాపకముంచుకొనవలెను. చెడ్డగుణముకంటె మంచిగుణము యెక్కువ గుణములలోనే తారతమ్యమున్నదిగాని మనుష్యులలో లేదు అని అందఱియందును సమానభావముంచి చూడవలెను. తామేయెక్కువ

అని అనుకొనువారికే అందటికన్న హీనులు; ఎక్కువవారైయున వారు మెక్కువఅని ఎగిరిపడుచుందురు. సేవయు పరోపకార మెక్కువగా జేయుటవల్ల యెక్కువగానుండుట తటస్థించును గాని అహంభావముగా గర్వపడుటవల్ల కాదు.

ఎండ్. ఇజ్ మి. దేర్ ఫ్యోల్స్.
నో గ్రేట్‌నెస్ సేవ్ ఇట్ బి సం పాక్ ఆఫ్ టచ్
ఆఫ్. గ్రేట్‌నెస్ టు నో. వెల్ ఐ యాం నాట్ గ్రేట్

అని కవి వర్ణించి యున్నాడు. అనగా " నాకేమియు గొప్పతనము లేదు అని గ్రహించియుండుట తప్ప వేరేమియు గొప్పతనము నాయందు లేదు" అని భావము.

---

## శ్రీ రాములు.



బ్రతుకవచ్చుగాక బహుధనంబులయిన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైనఁజెడుగాక పడుఁగాక
మాటదిరుగలేరు మానధనులు.

శ్రీరాములువారు మనదేశమునందుండి అనేకవేల సంవత్సరములు జరిగిపోయినను, ఇప్పటికిని కోట్లకుకోట్ల జను

లాయన పేరును స్మరించుచున్నారు. ఎందువలన ? మాట తప్పకుండ జరిపించినందులకు.

ఆయనకు పట్టముగట్టుటకన్ని యేర్పాట్లు సిద్ధమయ్యెను. అయితే రాజ్యవైభవమును సర్వసుఖములను విడిచి అరణ్యములకు వెడలిపోయెను. సామాన్యులమైన మనము పొరుగూరికి పోవలెనన్న బస, భోజనవసతు లెట్లుండునో అని సందేహింతుము. ఆయన సుకుమారముగ పెరిగిన రాజకుమారుడైనను ఒక మాటను నిలుపుటకై రాజగృహములను విడిచి దారిలేని అడవులలోనికి బోయెను.

ఆమాటయైనను తానిచ్చినమాటకాదు, తన తండ్రి యిచ్చినమాట. ఆమాటయు యెవరికిచ్చినది ? బలవంతులైన ఇతరరాజులకా ! మాటప్రకారము జరుపనియెడల నాకేమి చేయుదురో అని భయముచా? లేదు. అదిఒక అబల కిచ్చినమాట ఇంటియందలి స్త్రీ. లేదు పో అనిన వారెవరూ లేక పోవలసినమనిషి.

శ్రీరాములు నాడేగాక మన పూర్వులందరు సామాన్యముగ నిలబెట్టియుండిరి. రెండువేల సంవత్సరముల క్రింద ఇటలీదేశములో యారియన్ అను పేరుగల చరిత్రకారు డుండెను. అతడు వ్రాసిన గ్రంథములో మన దేశస్థులను గురించి "ఇండియాదేశస్థులు సత్యవంతులు" అని వ్రాసియున్నారు. అది

మన గొప్ప చెప్పుకొనుటకు మనవారు వ్రాసినగాని దికాదు ఇతర దేశస్థులు మనదేశమును గురించి వ్రాసినమాట.

ఈరోజులలో యెవరైనను శ్రీరాములువారివలె చేసిన యెడల వానిని పిచ్చివాడందురు. అయితే మనపూర్వులు పిచ్చివారా? యిప్పటివారు పిచ్చివారా ? దగాచేసి గాధించి వేసినానని ఒకడు సంతోషించుట యేమి తెలివి ? ఈరోజులలో నొకడొక పనిచేయుదునన్న అదిచేయువరకు నమ్మకములేదు. ఒకడొకమాట చెప్పిన అది జరుగువరకు నిజములేదు. క్రమముగా పనులు జరుగవలెనన్న బైటదేశమువారిని పెట్టి జరిపించుకొనవలసివచ్చుచున్నది. సరియైన సరుకులు కావలెనన్న బైటదేశపుసరుకులు కొనవలసివచ్చుచున్నది. గొప్పవ్యాపారములు పదిమందికలిసినగాని సాధ్యములుకావు. ఒకరిమాట నొకరు నమ్మి పదిమందికలిసి గొప్ప కృషులు వ్యాపారములు పెట్టజాలకున్నాము. దేశములో జీవనములుపోయి అన్నమునకు అనేకులల్లాడుచున్నారు. నీతివిషయములో నెప్పుడు దారిద్ర్యము కలిగెనో అన్ని విషయములలో నప్పుడే కలిగెను.

ప్రజలలో మాటనిలకడ లేకపోవుటవల్ల ప్రజలందరికి నెంత నష్టము కష్టము కలుగుచున్నదో వడ్డీల విషయమొక దృష్టాంతము. మన దేశములో వడ్డీలరేట్లు చాల అధికముగ నున్నవి. అప్పులు తెచ్చుకొనవలసి వచ్చినప్పుడు వడ్డీలు పెరిగి

పోయి అనేక సంసారములు చితికిపోవుచున్నవి. పెక్కుమంది వ్యాపారములు పెట్టినను వాటివల్లవచ్చు రాబడి వడ్డీకే సరి పోవుచు లాభము పుట్టుట కష్టసాధ్యముగ నున్నది. దీనంతటికి కారణమేమని యోచించినారా. సర్కారువారికి ఋణము కావలెనన్న నాలుగుఅణాల వడ్డీకి కోట్లకుకోట్లు రూపాయలు దొరుకుచుండును. సామాన్యముగ మనప్రజలకు ఋణముకా వలెనన్న పెచ్చువడ్డీలు కోరబడుచుండును. సొమ్ముపోదను నని ధైర్యముండుటయు లేకపోవుటయు, ఇదియే ముఖ్యకారణము. మనపూర్వులు అప్పుపుచ్చుకొనినవారు పోయినను అతని పుత్రులు అప్పునుతీర్చవలెనని నియమించిరి. ఇదిమిక్కిలి తీవ్రముగనున్నదని ప్రివికౌంసిలువారు కుటుంబ ఆస్తివరకు మాత్రము బాధ్యతఉండునని ప్రస్తుతపు రోజులలో నియమించి యున్నారు. మనుష్యుడు పోయినను మాట పవిత్రముగా చూచుకొని కుమారుడు అప్పును తీర్చవలెనని మనపూర్వులలో పద్ధతిఉండినట్లు ఏదేశములోను లేదు. ఈరోజులలోమాట నిలకడ లేకపోవుటవల్ల అప్పు పుచ్చుకొనినప్పటి నుండియు వచ్చునో పోవునో అను సందేహముండుటవల్ల వడ్డీలెట్లు అధికముగనుండి ఎవరైనను మాటతప్పని వారున్నను అందరితో పాటు వారును కష్టపడవలసి వచ్చుచున్నది.

ప్రపంచమునందున్నత దశనుపొందిన దేశములును గలవు క్షీణించిపోయిన దేశములును గలవు. నీతి లేకపోవుటయే

దీనికి కారణము ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీ మొదలైన పశ్చిమ దేశము లిప్పుడు కీర్తితో నున్నవి. ఇదివరలో నీతిగలిగి యుండి నందులకిప్పుడు ఫలము ననుభవించుచున్నవి. సుమారు 500 సంవత్సరముల క్రిందవరకుకూడ వారిలో నొక విచిత్రమైన పద్ధతియుండెను. ఒకరినొకరు అతితీవ్రముగ దూషించుకొన వలెనన్న "నీమాటఅసత్యము" అని అనుచుండిరి. మాతృసోదరుల కంటె నది అపరిమితమైన రోషమును పుట్టించుచుండెను. అన్ని నిందలకంటె దానిని భరింపరాని నిందగ దలచుచుండిరి.

సుమారు 125 సంవత్సరముల క్రింద ఇంగ్లీషు, జర్మనీ కలసి ఫ్రాంసుతో యుద్ధము చేయుచుండెను. ఇంగ్లండు, జర్మనీ సేనలు కలువ కూడదని ఫ్రాంసువారి ప్రయత్నము. ఫలాన చోటకు వచ్చి కలుసుకొనెదనని ఇంగ్లీషుసేనానికి జర్మను సేనానిమాట యిచ్చియుండెను. దుప్పులను వేటకుక్కలుపట్టి వదలనట్లుగా ఫ్రెంచిసేనలు జర్మనుసేనలను బాధించుచుండెను. పిడుగులు పడుచుండెను, వర్షములు యేకధారగా భూమ్యాకాశములను కలుపుచుండెను. రోడ్డులు మోకాలులోతు బురదలై ఫిరంగి బండ్లచక్రములు యిరుసులవరకు యిరుకుకొని పోవుచుండెను. జర్మనీ సైన్యములకు నిద్రాహారములు సరిగా లేవు. ఎడతెరపి లేక తిరుగుటవల్లను పోరాటములవల్లను సైనికు లెక్కడివారక్కడ కూలిపోవుటకు సిద్ధముగనుండిరి. వారి కుత్సాహము కలుగుటకు జర్మను సేనాని యేమనెను? ఫల

హారములు పెట్టించెదననెనా బహుమతుల నిప్పించెదననెనా ?
ఆయన తిరిగి, తిరిగి ఒకటేమాట అనుచుండెను. "నేను ఇంగ్లీ
షుసేనానికి మాట యిచ్చినాను. మన మక్కడ చేరవలెను.
మన జర్మనులమాట యింతయేననుకొనరా" అని ఒకే కలవ
రింతగా పిచ్చిపట్టినవానివలె తిరిగి తిరిగి అనుచుండెను. తుదకు
ముందనుకొనినట్లు ఇంగ్లీషుసైన్యముతో చేరెను. వారిరువురును
కలిసి ఫ్రెంచిసైన్యమునోడించిరి.

అసత్య మాడకూడదనగా నందఱును మనరహస్యములు
చెప్పి తెలివి తక్కువగ ప్రవర్తించవలెనని కాదు. శత్రువులు
ప్రభువును పట్టవలెనని వెదకుచుండిరి. ఇల్లంతయు వెదకిరి
కనబడలేదు. ఆతని కుమారుని పిలిచిరి. "మీతండ్రిని ఆఖరు
దఫా యెప్పుడుచూచితివి. కఠినముగ దండించెదము. నిజము
చెప్పు" అని అడిగిరి. ఆబాలుడు "నిన్నరాత్రి చూచినాను"
అని చెప్పెను. "ఎక్కడ, ఎక్కడ" అని వారాతురతగనడిగిరి.
ఇంటివారందఱును వాడెక్కడ గుట్టును బైటపెట్టునో యని
విస్మయపడి చూచుచుండిరి. అప్పుడా బాలుడు "నిన్నరాత్రి
మాతండ్రిని నాకలలో చూచినాను" అని చెప్పెను. పిమ్మట
వారెన్నిఅడిగినను, యెంతబెదరించినను జవాబు చెప్పనెను.
తుదకు బాలుని ధైర్యమునకు మెచ్చి విడిచిపెట్టిరి.

ఇంగ్లీషువారు మితభాషులని పేరుపొందియున్నారు.
"మనమాటయే మన వ్రాతపత్రము" అని వారికి లోకోక్తి

కలదు. బుద్ధిమంతులేమాటలో యేపొల్లువచ్చునో అని మితభాషులైయుందురు. అనవసర ప్రసంగములు పెట్టుకొనరు. "లీలలంచను బొంకులు తేసివాడు" అని ప్రస్తావనని వర్ణించిరి. హీనులు చెవులుగోసిన నక్కలవలె వాగుచుందురు.

అసత్యమాడకుండుట. ఆడినమాట అసత్యముగాకుండ నామాటప్రకారము జరిపించుట. ఈ రెండు గుణములుండిన నేదేశమైనను యెంతోగొప్పదశను పొందవచ్చును. సకలైశ్వర్యములతోను తులదూగవచ్చును. అట్టిజనులు సాధించలేని కార్యమేమున్నది?

శ్రీరాములువారిపేరు నేటివరకును మనదేశమంతటను వ్యాపించియుండుటెంతయు శుభదాయకము. అయితే "రామ, రామ" అని కేకలువేయుటవల్ల ముక్తిరాదు. "రామ, రామ" అని గంతులువేయుటవల్ల మోక్షములేదు. శ్రీరాములువారి జీవితము నాదర్శకముగ నుంచుకొని వారభ్యసించిన గొప్ప గుణముల నభ్యసించిననే మనకును మనదేశమునకును విముక్తి కలుగును.

## 2. భరతుడు.

అన్నగారి రాజ్యము తనకువచ్చెనని తెలియగా భరతుడేమనెను? "ఆహా! రాజ్యపదవి వచ్చెను" అని సంతోషించెనా? "ఛీ! ఛీ! ఇది నాకక్కరలేద నెను.

ఇట్లు తనకక్కర లేదని నిరాకరించిన దేమి ? స్వల్పవిష యమా ? చిన్న వస్తువా ? మహారాజు పదవి. భూమండల రాజ్యము. భూలోకములో అంతకంటె గొప్ప పదవి లేదు. దానిని పొందుట కాయనచేసిన కుట్రగాని, దుర్మార్గముగాని యేమియు లేదు. విధివశమునవచ్చినదని తాననుభవించి యుండ వచ్చును. అయినను యిది నా సొమ్ముగాదు నాకక్కర లేద నెను. అక్కర లేదని యూరకుండక, కొండలు నదులు దాటి అడవులలోనికి బోయి అన్నగారిని కలుసుకొని "నీరాజ్యము నీవు తీసుకో"మ్మని యొప్పజెప్పెను.

ఇద్దరు గుమస్తాలు తమ యజమానుని ఆఫీసులో పని జేయుచుండిరి. "జాబు వ్రాసుకొనవలెను. నీ వద్ద కాగిత మున్నదా"అని ఒక డడిగెను. రెండవవాడు డస్కుబల్లతీసి యజమానుని కాగితము ఒకటివ్వబోయెను. "యజమానుని కాగితము మనము తీసుకొనగూడదు"అని మొదటివాడు నిరాక రించెను. "ఒక కాగితమేగద"అని రెండవ వాడనెను. "కాగి తము ముక్కయినను సరే. యజమానుని సమ్మతిలేక అతని సొమ్ము తీసుకొనగూడదని" మొదటివాడు జవాబుచెప్పెను. స్వల్ప విషయములలోనైనను ధర్మబుద్ధిగలవారు నీతిమార్గ మును తప్పరు.

"ఒకరిసొమ్ము వసకొందురు. తినునప్పుడు తియ్యన, వెనుక విషమగును"అను న్యాయబుద్ధి యేదేశమున ప్రజల

యందుండునో, అట్టిదేశ మెంత గొప్పదశను పొందవచ్చును! అందలి జనులందఱుకూడ యెంత సుఖముగ నుండవచ్చును!

పూర్వము మెగస్తనీసు అనువాడు గ్రీసుదేశమునుండి మనదేశమునకువచ్చి మనదేశమునుగురించి ఒక పుస్తకమును వ్రాసెను. అందు పసిబాలుడైనను మనదేశమున చేతబంగారు ముద్దలు పట్టుకొని ఒక చివరనుండి ఒకచివరకు నిర్భయముగ తిరుగవచ్చునని వ్రాసెను. మనపూర్వుల గొప్పదశకును వారి నీతికిని సరిపోయెను.

లోకుల సొమ్ముపై నపేక్షకలుగునట్లు నీతిక్షీణించుటకు కారణమేమి! విషయాసక్తియే. విషయాసక్తికి కారణమేమి? మాయ. మనుష్యునకు సుఖదుఃఖములు తన మనస్సునందే యుండునుగాని యేవిషయవస్తువులందును లేవు. భగవంతు డీ విషయమును మాయతో కప్పివేసెను. ఏదో భ్రమపడి సంతోష మందులోనే యున్నదని ప్రయత్నించెదరు. చేతికి వచ్చిన వెనుక నింతేగద అనుకొందురు. చేతికిరానియెడల నేమొ యున్నదని ఇంకను దుఃఖపడుచుందురు.

ది విల్‌టక్ సీన్ ది ఫెయిరీ గోల్డ్
ట్రాంస్‌ఫార్ండ్ వ్హైల్ వన్ టు డ్రాసీ మోల్డ్
బట్ స్టిల్ ది వ్యార్క్వెష్డ్ మోర్టల్స్ హిజ్ లాస్
ఎండ్ రూస్ ఫర్ గోల్డ్ ది గ్లిటరింగ్ డ్రాస్.

ప్రపంచభోగములలో తగులుకొని తగులుకొని తుదకు బంగారమనుకొని భ్రమపడు నది మన్నకద అని తెలియునట.

ది వర్ల్డ్ హి లవ్డ్ సో మచ్
హాడ్ టర్న్డ్ టు డస్ట్ ఎండ్ యాషెస్ ఎట్
హిజ్ టచ్.

ఆర్యులారా ! ఆంగ్లేయకవులు చెప్పినను సరే, మన కవులు చెప్పిననుసరే, ఈ మతగురువు చెప్పినను సరే, ఆ మత గురువుచెప్పినసరే, ఇప్పుడు చెప్పినసరే వేలసంవత్సరముల పూర్వము చెప్పిననుసరే వేలసంవత్సరముల జరిగిపోయిన వెనుక చెప్పినసరే, సృష్టిని జ్ఞానదృష్టితో జూడుడు, అందున్న సంగతి ఒకటియే. ఒక ఆంగ్లేయకవి వర్ణించినట్లు

"దిస్ స్మాల్ మాడెల్ ఆఫ్ ది మదర్ ఎర్త్
దట్ సర్వ్స్ యాజ్ ఫ్లెష్ ఎండ్ కవర్ టు అవర్
బోన్స్".

ఎముకలచుట్టు పూసిన ఈ కాస్తమట్టికి, ఈశరీరమునకు యదార్థముగ కావలసిన దెంతస్వల్పము ! ఆహారమా, యెంత సులభమైనదో శరీరమునకంత ఆరోగ్యము. మిఠాయిలు, మసాలా లెక్కువైనకొలది రోగములెక్కువే. పానీయమా ఉచితముగ దొరుకు నీటికంటె శ్రేష్ఠమైనదేది ? నివాసమా. ఆకాశమును జూచుచు మట్టిమీద పరుండుట అంతఃపురము లలో హంసతూలికా తల్పములపై పరుండుటకంటె నారోగ్య

కరము. ఉడుపులా, అవి యెంతతక్కువ యుండిన నంతమంచిది. గాలి, వెలుతురు, మన చర్మములపై నెంతబడుచుండిన నంత ఆరోగ్యము. మనకు కావలసిన వస్తువులు కొంచమే. సహజ ముగ నెల్లప్పుడును దొరుకునవియే. అయినను లోకులతలలు కొట్టి ముందురోజులకు దాచ దలచెదమా? ఎంత వెఱ్ఱిభ్రమ !

కలనాటిధనములక్కర
గలనాటికిదాచ కమలగర్భునివశమా
నెలనడిమి నాటివెన్నెల
యలవడునే గాదె వోయ నమవసనిసికిఁ.

రాజుగారికి రాజ్యము పోయినదనగనే, లక్షలు విలువ గల హారములు మెడలోనేయున్నను, యిక జన్మమెందుకని దుఃఖించును. లక్షాధికారికి వేలకొలది ఆస్తియున్నను లక్షలు పోయినవనగనే అపరిమిత దుఃఖము గలుగును. కొన్నివేలు ఆస్థిగలవారికి నష్టములువచ్చి వందలుమాత్రము మిగిలినవనగనే చెప్పరాని దుఃఖము గలుగును కాని ఒక వందరూపాయల పాటి ఆస్థియు లేనివారెందరో లక్షలు కోట్లుగా మనదేశమున లేరా ? వారు సంసారములను సాధారణ కష్టసుఖములతో జరుపుకొనుటలేదా. మన శరీరములకు కావలసినవి కొంచెము. మాయచే భ్రమపడి అనేక అనవసరములైనవి అభ్యాసముచే అవసరములను జేసుకొని అవిలేవని కొంతసేపు, లేకపోవు

నేమోఅని కొంతసేపు బాధలు పడుచున్నాము. పొయ్యిలో మూడుకట్టెలుండిన బాగా మండుచుండును. అప్పుడు యింకను మూడుకట్టెలు పెట్టిన,పొయ్యి క్రిక్కిరిసిపోయి గాలిఆడక అసలే చప్పగా చల్లారిపోవును. మనశరీరములకు చేసుకొనదగినది స్వల్పము. అంతకంటె ఎక్కువగజేసిన, బాధకలుగును గాని యెక్కువ ఫలము కలుగదు. ఎక్కువైన అన్నము విషమగును గాని యెక్కువ బలముకలిగించదు. మనమేలును కోరు కొనుచు మనకుగాను మనము చేసుకొనదగినది స్వల్పమే. అంతకంటె యెక్కువ జేసుకొనిన నెక్కువ కీడుకలుగునుగాని యెక్కువ మేలుకలుగదు. ఇతరుల మేలును కోరుచు, ఇతరు లకుగాను మనము చేయుదగినది అనంతము. దానికి అంతు లేదు. ఎంతహెచ్చుగాజేసిన నంత పుణ్యము ఫలము కలు గును కాని కీడుకలుగదు.

ఒక చెట్టునుచూడుడు. ముండ్లు మొదలైనవాటితో కాపాడుకొనుచు, ముందు తన జీవనమునకు కావలసినవి చేర్చుకొనుచుండును. పిమ్మట కొంత యీడువచ్చిన వెనుక పువ్వులు, పండ్లు సదా యితరులకిచ్చుచుండుటయే దానిపని. మనుష్యుని జీవితము అట్లేయుండవలెను. " జరయుమృతియు లేనిజనునట్లు ప్రాజ్ఞుండు, ధనము విద్యగూర్పగడగవలయు"నని యట్లు సదా సంపాదించుచునే యుండవలెను. అయితే తన

ప్రయత్నములన్నియు ముందు తన జీవనము కొఱకును పిమ్మట ప్రజలక్షేమముకొఱకును వినియోగింపవలెను.

గొప్ప వృక్షములు కనబడినప్పుడు వాటిచుట్టును ముమ్మారు ప్రదక్షిణము చేయుమని మన పూర్వులు నియమించిరి. చెట్లనుచూచినప్పుడెల్లను వాటిజీవనములు ఏవిధముగా మన జీవనముల కెట్లు ఆదర్శకములో స్మరణకు తెచ్చుకొనుడు. ప్రజాక్షేమమునకు పాటుబడుటయే భగవంతునకు సేవజేయుట. దేవుడు మనకీజన్మములో వేఱువిధముగ కనబడడు. స్వార్థపరత్వమును మాని మన యావత్తు శక్తులను పరోపకారార్థము వినియోగించుటయే భగవంతునకు సేవజేయుట. అదే మోక్షదాయకము. ఈ భావమే ఈ క్రింది పద్యమునందు తెలుపబడినది.

సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు
మధువైరిఁ దవిలినమనము మనము
భగవంతు వలఁగొనుపదములు పదములు
పురుషోత్తమునిమీఁద బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి.

మనకు హానికలుగకుండ మనము అనుభవించగలిగినది స్వల్పమే అని గ్రహించినవారికి అన్యాయముగా సంపాదించవలసిన అవసరమేమియు గనబడదు. అట్లు చేయవలెనని బుద్ధియును పుట్టనేపుట్టదు. అట్లు చేయవలెనను తలంపే పిచ్చిభ్రమగతోచును. అట్టివారు తమ శరీరముల కవసరమైన కొన్ని వస్తువులతోనే సులభశైలిని జీవనములను గడుపుకొనగలరు. సంపదలు, సౌఖ్యములు ఉన్నయెడల ఉండనిమ్ము అని అనుభవింతురు. లేనియడల లేవేఅని దుఃఖపడరు.

టర్న్, ఫార్చ్యూన్, టర్న్ దై వీల్ ఎన్డ్ లోవర్ ది ప్రౌడ్
విత్ దట్ వైల్డ్ వీల్ వి గో నాట్ అప్ ఆర్ డౌన్
స్మైల్, ఎన్డ్ వి స్మైల్ ది లార్డ్స్ ఆఫ్ మెని ల్యాన్డ్స్.
ఫ్రౌన్, ఎన్డ్ వి స్మైల్ ది లార్డ్స్ ఆఫ్ అవర్ ఓన్ హ్యాన్డ్స్.

సృష్టియుద్ధమయము యుద్ధమునకు ధైర్యము, బలము, ఇట్టి తెలివితోడిగుణములు ముఖ్యము.తమ ఆరోగ్యము,బలము,శక్తి,

వీటికి లోపముకలుగకుండ ఎంత సులభశైలిని జీవించవచ్చునో అంతసులభశైలిని జీవించుట మహాపురుషుల లక్షణము. అంత కంటె అధికముగ నున్నయెడల నుండనిమ్మనెదరు. అయితే ప్రహ్లాదుని గురించి,

విశ్వమందుగన్న విన్నయర్థములందు
వస్తుదృష్టిజేసి వాంఛయిడడు.

అని వర్ణించినట్లు, వారి దృష్టియు వారి మనస్సును మాత్రము వాటియందు తగులుకొని పోనదు. పూర్వము రోము రాజ్యము జరుగుచుండినప్పుడు రోమను సైనికులధాటికోర్వ జాలక వారి శత్రువులు సంధిజేసుకొనెదమని వచ్చిరట వారి అధికారులను వశపరచుకొనవలెనని కొన్ని వెండి, బంగారు పాత్రలు తీసుకొనివచ్చిరి. అయితే రోమనులలో సర్వఅధికార ములు కలిగిన అధిపతినిచూచుటకు పోగా, అతడేమి చేయు చుండెను ? ఆరుబైటనాలుగుకట్టెలను మండబెట్టి తన భోజ నమునకు కొన్ని దుంపలను ఉడుకబెట్టుకొనుచుండెనట. వారు తెచ్చిన వెండి బంగారుపాత్రలను చూచినవ్వెనట.

ప్లూటార్క్ అను గ్రంథకర్త రోమనులలో మహాపురు షుల జీవచరిత్రలు వ్రాసెను. అందు యాంటొనీ అనువాని చరిత్ర వ్రాయుచు ఇట్లు తెలిపెను. ఆతడు రాజధానియందున్న ప్పుడు సర్వ సుఖములు, సర్వ సంపదలు, సర్వ ఐశ్వర్యము లతో మహా సుకుమారముగ బ్రతుకు చుండెనట. అయితే

పటాలములతో దండయాత్రల బోవునప్పుడు సామాన్య సైనికులకంటె సులభశైలిని జీవించగలడట. పేదఱికములోపుట్టి పెరిగిన మోటు సైనికులుకూడ ఆతనినిచూచి ఆశ్చర్యపడుచు నెంతయు గౌరవించుచుండిరట. మహాపురుషు లందఱకును ఇదియే లక్షణము. విషయవస్తువులు వారికి లోబడియుండిన యుండునుకాని వారు మాత్రము విషయ వస్తువులకు లోబడి యుండరు.

హాటకగర్భురాణి నిను నాకటికిం గొనిపోయి యల్లక
ర్నాటకిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ

అనుచు బమ్మెర పోతన రాజసన్మానమును, ఐశ్వర్యమును నిరాకరించలేదా !

రోమనుల సామ్రాజ్యమునందు వారి సామంత రాజులు సభలు చేయునప్పుడు, రాజు అనేకరంగులుగల వెలగల బట్టలతోను, నగలతోను తళతళలాడి పోవుచుండగా అతనికంటె బలవంతుడగు రోమను ఉద్యోగి సామాన్యమైన ఉడుపులతో అతని వెనుకనే నిలుచుండునట. ఒకనికి భోగము. ఒకనికి కానలెనన్న భోగముల ననుభవించగలిగిన శక్తి, భోగములపై దృష్టి కలిగి శక్తిని పోగొట్టుకొనినది సామంతరాజు. శక్తిపై దృష్టి కలిగి భోగములకు లెక్కచేయనిది రోమను ఉద్యోగి.

ది స్టార్స్ ఎన్డ్ సాన్ డిన్గ్ వ్యాటీస్
దట్ హాఫ్ ది క్రౌడ్ బివిచ్,

శ్రీ [illegible] యము,

వ్హాట్ ఆర్ దె బట్ ఇన్యానిటీస్
టు హిం దట్ క్రైడ్స్ ది పిచ్.

పూర్వకాలమున పర్షియా దేశపువారును గ్రీసు దేశపువారును ఒకచోట కలుసుకొని సంధిచేసుకొన నిశ్చయించిరట. గ్రీసుదేశము వారు వేళకువచ్చి చెట్ల నీడలో కూర్చుండిరి. పర్షియావారు ఎంతకురానందున తుదకు వారు సంచులను విప్పుకొని రొట్టెలుతీసి తినుచుండిరి. ఈ లోన పర్షియావారి సేవకులనేకులువచ్చి గుడారములు వేసిరి, తివాచులు పరచిరి, అనేకబండ్ల సామానులు, వంటసామగ్రి, వంట మనుష్యులు అందఱు వచ్చినవెనుక తుదకు వారి అధికారి వచ్చెను. వచ్చి ఎదుట చెట్లక్రిందనున్న గ్రీసుదేశస్థులను చూచెను. చూచి వారి నిరాడంబరమునకు మెచ్చుకొని బుద్ధిమంతుడగుటచే వారి నోడించుట దుర్లభమని గ్రహించి వారు కోరినట్లు సంధిజేసుకొనెను. పిమ్మట కొన్నితరములు గడచినవెనుక గ్రీసుదేశస్థులు పర్షియావారిని పూర్తిగాఓడించి వారిదేశమును లోబఱుచుకొనిరి.

కష్టములకు ఓర్చుకొనుట, సులభశైలిని జీవించుచుండుట మన దేశస్థులకు అనాదినుండియు అభ్యాసములు. ఇవి మంచిగుణములు. వీటిని విడువరాదు. ఎన్నటికైనను మన దేశమును ముందుకు తీసుకొనివచ్చు గుణము లివియే. నవనాగరికతలో అనేక విషయ భోగములు లభించుటను జూచి

వాటిపై భ్రమపడి అనేకులు వాటికి లోబడిపోవుచున్నారు. ఆంగ్లేయులనుజూచి వారి సద్గుణములను నేర్చుకొనకపోయినను మనదేశమునకు అవసరములేనివారి ఉడుపులను ధరించుట; సిగరేట్లు, చుట్టలుకాల్చుట; తేయాకు, కాఫీ, కోకో, సోడాలెమ నేడ్లువిదేశసారాయిలుత్రాగుట; వేళాపాళాలేకఅనారోగ్యమైన చిరుతిండ్లు పెట్టు కాఫీహోటల్సు; చీట్లపేకలతోను గుఱ్ఱపు పందెములతోను ఆటలు, జూదములు; తమకును ఇతరు లకును ఉపయోగములేకుండ ప్రతిదినము సాయంకాలమును వ్యర్థపఱచుటకు క్లబ్బులు; ఇట్టివి, త్యాగమునకుగాక భోగ మునకు సంబంధించినవి, దేశమంతయు కార్చిచ్చువలె వ్యాపించి పోయి ప్రజాక్షేమమును ధ్వంసము చేయుచున్నవి. రత్నములు భూగర్భమందుండి పైన గడ్డిమాత్రము సులభముగ కనబడు చుండునట్లు, ఆంగ్లేయులను ఉన్నతదశకు తీసుకొనివచ్చిన గుణ ములు వేఱేఉన్నవి. వానినే మనము వారిని జూచినేర్చుకొన వలెను. వేళకు వచ్చుట; డ్యూటీతప్పకుండజేయుట; పనినేర్చు కొనునప్పుడు సమర్థులగునట్లు మనస్ఫూర్తిగా బాగా నేర్చుకొ నుట; పనిచేయునప్పుడు శక్తికొలదిగట్టిపనిగా బాగా జేయుట; వ్యాపార వ్యవహార విషయములలో నమ్మకము కలుగునట్లు పనిజేయుట; శ్రమకు వెనుదీయకుండుట, సోమరితనము లేకుండుట; దేశభక్తి; వారిదేశమునకును, వారి ప్రజలక్షేమము నకును, కష్టనష్టములు పడుటయేగాక ప్రాణమును పహితము

అర్పించు త్యాగబుద్ధి; ఇట్టివి అనేక సద్గుణములుండుట వలననే వారికి ఉన్నతదశ కలిగెను.

సులభశైలిని జీవించుటమానుకొని నవనాగరికతయందలి అల్ప భోగములపై మనస్సును పోనిచ్చుటచే విషయాశక్తి హెచ్చగుచున్నది. విషయాసక్తి హెచ్చగుటచే ధనాపేక్ష కలుగుచున్నది. ధనాపేక్ష కలుగుటచే పరులసొమ్ము విషమనుమాట మఱుపువచ్చినదుం

డర్థార్జనదుఃఖమున

పాడీకృత జన్ముడగుట పరమార్థమిల్లా

అనువాక్యము సార్థకమగునట్లు మనుష్యుల జీవితములు అనేక విధములుగ నిరర్థకములగుచున్నవి. ధనము ముఖ్యమైనదైనను, ధనముకంటె ముఖ్యమైనది గుణము. గుణమున్నచోటునకు ధనమువచ్చును, ధనమేగాక ఇంక అనేకములు ఏవికావలెనన్న అవియును వచ్చును. పిల్లలకు ధనముచేర్చిపెట్టిపోతే చాలునని అనేకులు అన్ని విధముల, వారికొఱకు ధనము పోగుచేసిపెట్టి పోవుచున్నారు. అట్లు పోగుచేసిపెట్టియివ్వబడిన ధనమువల్లనే సాధారణముగ పిమ్మట ఆపిల్లలు పాడయి పోవుచున్నారు. పశ్చిమదేశములలో కోటీశ్వరులు తమ పిల్లల జీవనాధారమునకు మాత్రము ఏర్పాటుచేసి అంతకంటె ఎక్కువ కావలెనన్న వారు కష్టపడి సంపాదించవలసిన అవసరము కలుగునట్లు చేయుచు, మిగి

లిన ఆస్తినంతయు లోకోప కారమునకు ఖర్చు పెట్టు చున్నారు. పిల్లలకు ధనములకంటే గుణములు కలు గునట్లు పెంచుటముఖ్యము. ఎన్నిసద్గుణము లుండిన నంత సుఖపడుననుటకు సందేహము లేదు. ఎంతధనముండిన నంత సుఖపడునను నిశ్చయము లేదు.

మాటవిషయములో నీతి లేకపోవుటచే ప్రజలకెట్టి కష్టములు కలిగెనో దృష్టాంతములను చూచియున్నాము. ధనము విషయములో నీతితగ్గిపోవుటచే ప్రజలకెట్టి కష్టములు కలుగునో దృష్టాంతములను చూడుడు.

వ్యాపారము కామధేనువువంటిది. ఇచ్చువారికి పుచ్చు కొనువారికికూడ తృప్తి, సంతోషము కలుగజేయును. అనేకు లకు జీవనోపాధికలిగించును. అన్యాయము ప్రబలమగుటవల్ల మనదేశమునందుండదగిన వ్యాపారములో ఒక వీసముకూడ లేదు. మనదేశములో అనేకులు సంగతులు తెలియనివారు న్నారు. అనేకులు పేదతికమువల్ల ఏదోఒక ధరకు అమ్మకొని పోవలసినవారైయున్నారు. ఎదుట వానిస్థితినిబట్టి తాను కొను నప్పుడు ఒకరూపాయిసొమ్ము అర్ధరూపాయకు కొనుట, తాను అమ్మునప్పుడు అర్ధరూపాయిసొమ్మునకు ఒకరూపాయి వసూలు జేసుకొనుట, ఇట్లు చేయుటవల్ల ఆసమయమునకు లాభము కనబడినను అట్టి అన్యాయమువల్ల వ్యాపారము

ణించిపోక తప్పదు. ఎదుటవానికి నమ్మకము, తృప్తి, కలుగునట్లుచేయు న్యాయమైన వ్యాపారమే వృద్ధిపొందును, వృద్ధిపొందించును.

ప్రజారాజ్యము దేశమునందు వ్యాపింపజేయ వలెనని సర్కారువారు దేశమంతటను నిర్మించియున్న స్థానికస్వపరిపాలన సంస్థలు బాగుగా జరుగువలెనన్న ధనము విషయములో నీతియుండుట మిక్కిలి అవసరము. పన్నులుమూలముగా వసూలు కాబడిన ప్రజలసొమ్ము ప్రజల ప్రతినిధుల వశమైయుండగా, తాము దుర్వినియోగము చేయక, యితరులచే దుర్వినియోగము చేయబడనివ్వక క్రమముగా ప్రజల కొఱకు ఖర్చగునట్లు చూడవలెను. లేనియడల స్వపరిపాలన వల్ల ప్రజలకు క్షేమముకలుగదు. బాధలు ఎక్కువగును.

మనదేశము పేదదేశమనియు, పన్నులు హెచ్చుగా ఉన్నవనియు, అనుకొను చుండగా, భూమిపన్నులు, నీటిపన్నులు, చెట్లపన్నులు, మొదలైన సర్కారు పన్నులు, రుసుములు వసూలుచేయువారు, మామూళ్ళు, సప్లయిలు అని వసూలు జేసుకొనుచు పన్నులభారము ప్రజలపై రెట్టింపుగా పడునట్లు చేయుచున్నారు. పన్నులు వసూలుజేయువారికి ఇతరులసొమ్ము విషమను స్మృతి లేకపోవుటవల్లనే ప్రజలకిట్లు హెచ్చుగా భారము కలుగుచున్నది. పల్లెలలో నివసించు అనేక

కోట్లజనులకు బాధకలుగుచున్నది.

ఏ వస్తువులోనైనను ఉప్పు తక్కువైనయెడల ఉప్పు కలుపుకొన వచ్చును. ఉప్పులోనే ఉప్పదనము పోయినయెడల దానిని బాగుపఱచు మార్గములేదు. దేశములో గొప్పవారు, తెలిసినవారు, ధనవంతులు, విద్యావంతులు, పలుకుబడి గలవారు, నీతివిషయములో ఇతరులకు దారిచూపునట్లు ప్రవర్తించనియెడల దేశము బాగుపడు మార్గములేదు.

ఇంగ్లాండు మొదలైన పశ్చిమదేశములలో మాత్రము అందఱు నీతిపరులుగా ఉన్నారా అని అడుగవచ్చును. మన దేశము వృద్ధికివచ్చు మార్గమును మనము చూడవలెను కాని ఇతర దేశములకెట్టిగతి పట్టినను మనకేమిఫలము? మన పూర్వుల చరిత్రనుండియు, ఇతర దేశస్థుల చరిత్రలనుండియు, అనేక దృష్టాంతములను చెప్పియున్నాను. పశ్చిమదేశములలోనైనను, తూర్పు దేశములలోనైనను, పూర్వకాలమునందైనను, ప్రస్తుతకాలమునందైనను, మిక్కిలి స్పష్టముగా ఒక విషయము కనబడుచున్నది. అది యేమనగా ఏ దేశములోనైనను, ఏ కాలములోనైనను, నీతిఉన్నచోట మనుష్యులకు క్షేమము, శుభము, ఆ దేశమునకు ఉన్నతదశయును కలుగును. నీతి క్షీణించినచోట ప్రజాక్షేమము తగ్గిపోవును దేశమునకు హీనదశయును కలుగును. ఇంగ్లాండు మొదలైన పశ్చిమ దేశములయందు ఇదివరలో నీతి హెచ్చుగా యుండుట

వల్లనే ఇప్పుడు అవి గొప్పదశకువచ్చినవి. ఇప్పుడు ఆదేశము లలో నీతితగ్గియున్న యెడల దాని ఫలమునుకూడ అవి ముందు అనుభవించక తప్పదు. మన దేశమునకైనను ప్రపంచములో యేదేశమునకైనను ధర్మమే ఉన్నతదశను కొనిపోవు మార్గము సత్యమే జయము.

---

## స్వతంత్రము, పరతంత్రము.

ఒకఊరులో ఒక గొప్ప నాటక ప్రదర్శనము జరుగు చుండెను. అన్నిచోట్లు జనులతో నిండిపోయి ఉండెను. అప్పుడు ఒక ముసలివాడు అక్కడకువచ్చి తనకు చోటుదొరకునేమో అని చూచెను. కాని యెంతసేపుచూచినా యెవరును చోటు యివ్వలేదు. కొందరు తాతా యిప్పుడే నిద్రలేచి వచ్చినావా అని వెక్కిరించిరి. చివరకు వాడు అటవిడిచి అక్కడ పొరు గూరువారు కొందరు కూర్చుండగా వారివద్దకు పోయెను. తక్షణం వారిలో ఒకడులేచి నిలుచుండి "అయ్యా, మీరు పెద్దలు కూర్చుండుడు. నేను నిలిచియుండగలను" అనెను. ఇది చూచి అందరు చప్పట్లుకొట్టిరి. అప్పుడు ఆ వృద్ధుడు "మనఊరి వారికిని మంచి తెలియును. పొరుగూరివారు మాత్రము దానిని అభ్యసించుచున్నారు" అనెను.

మంచి చెడ్డలు తెలియుటయే కాదు. మంచి మార్గమునే త్రొక్క ఆత్మనిగ్రహం బుండవలెను. కర్తవ్యము యిది అని తెలిసినవెనుక తనంతటతనే చేయువాడు స్వతంత్రుడు. అట్లు చేయలేనివారు పరతంత్రులుగాక తప్పదు. పడవలో చుక్కాని లేకపోయినను, చెడిపోయినను దానిని త్రాడుగట్టి యితరులు యీడ్చుకొని పోవలసినదే గాని వేరుగతి యేమున్నది? ఏమంతట తామే కర్తవ్యమును చేయువారు స్వతంత్రులు. తల మీద తన్నినగాని చేయకుండువారు పరతంత్రులు. ఇతరులచే గాని, సందర్భములచే గాని, నిర్బంధము కలుగుచేరకు లేచి యుండక, ప్రతి మనిషియు పైన చూచువారు ఉన్నను లేక పోయినను, గొంతుకుమీదకునచ్చినను రాకపోయినను తాను చేయవలసినపని చేసికొని పోవుట అభ్యసించవలెను.

---

## జటాయువు.

సారపుధర్మము నిర్మలసత్యము, పాపముచేత బొంకుచే
పారము జెందలేక చెడుపాలిదియైన యవస్థ, దక్షులై
వారలుపేక్ష జేసిరది వారికి చేటగుగాక, ధర్మవి
స్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడున్

దుర్మార్గులు దర్జాగా తిరుగుచుండుటయు, సత్పురుషులు సకలకష్టములు పడుచుండుటయు, చూచి పూచి అనే

కులు దేవుడు లేనేలేడని తమ మనస్సులలో నిర్ధారణ చేసికొనియున్నారు. ఇంకను అనేకులు గజేంద్రునివలె "కలడు కలండనెడువాడు కలడో లేడో" అని సందేహపడుచున్నారు అయితే సంశయపడవద్దు భగవంతుడన్నాడు. "దైవముండెడున్"

భగవంతుడుండుటయేగాక సమయానున [illegible] రాక ఏదోమూల నిద్రించువారివలెగాని, [illegible] అప్పలవలెగాని నిశ్చేష్టత వహించియుండక సదా ధర్మమును కాపాడుచు సత్యము శుభము వ్యాపించునట్లు చేయుచుండుట "ధర్మ విస్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడున్"

ధర్మమును కాపాడుటకు భగవంతుడేయున్నను, ప్రతి మనిషియుకూడ తన శక్తికొలది సదా ధర్మమును కాపాడుచు, అధర్మమును నివారించుచుండవలెను. భగవంతునితో ఏకత్వము కలుగుటకును, మోక్షమును పొందుటకును ఇదియే ముఖ్యమైనమార్గము.

జటాయువు శ్రీరాములవారి బంధువుకాడు; ప్రాణస్నేహితుడుకాడు; సీతను తెలిసినవాడుకాడు. అయినను ఎవరో అన్యాయముగ కష్టపడుచున్నారని తెలిసినవెంటనే ఒక నిమిషమైనను సందేహించక అడ్డపడెను. ఎదుటివాడు మూడులోకములను సాధించిన మహాబలశాలియగు రావణుడైనను దాను తిరిగి పారిపోలేదు. తన శరీరములో ప్రా

ము ముదవరకును " ఈ అధర్మకార్యమును జరుగనీయను " అని చెప్పి రాముని పాదములయందు ప్రాణములు విడిచెను.

జటాయువు పిచ్చివాడా? తన ప్రాణములు తనసుఖము చూచుకొనుచూ ఇంకను అనేకదినములు బ్రతికి యుండవచ్చును. అయితే పోవుచు పోవుచు నిండుప్రాణములను వదలుకొని పోయెను. ఇది దీర్ఘముగ యోచించి ధైర్యము ప్రోవు చేసికొని సాధించిన కార్యముకాదు. అధర్మమును చూచిన వెంటనే తనప్రాణములను లెక్కచేయుక అడ్డుపడెను. దీని సంగతియేమి? ఒకడు తన ఇల్లు వాకిలి శుభ్రముగా ఉంచుకొనినను, ఇరుగుపొరుగువారు తమఇండ్లలో మురికి చేరనిచ్చిన యెడల అంటువ్యాధులు ప్రారంభించి శుభ్రముగ ఉంచువారు ఉంచనివారు అను భేదములేక అందఱిఇండ్లను చుట్టబెట్టును. అందఱకు బాధకలిగించును. ఇట్లే అధర్మము నిప్పువంటిది. ఒకరికి హానిచేయునని చెప్పుటకు వీలులేదు. గ్రామములో నిప్పుపడినయెడల ఎవరిఇండ్లు కాలిపోవునో నిశ్చయము లేదు. గాలి లేనియెడల నిప్పుపడినఇల్లుకాలును. ఈ వైపునుండి గాలివీచినయెడల ఆ వైపుఇండ్లు కాలును. గాలిమారి ఆ వైపు నుండి వీచినయెడల ఈవైపు ఇండ్లు కాలిపోవును. నిప్పు ఎట్లు ముప్పో ప్రజాక్షేమమునకు అధర్మమును అట్లేముప్పు. నీతి తగ్గుటవల్ల దేశములకు హీనదశకలిగి ప్రజలకు బ్రతుకులులేక పోవు చున్నవని దృష్టాంతములతో సహా చూపియున్నాము.

అయితే ముందు కష్టము కలుగగలదను జ్ఞానము కలిగి ఇప్పుడు చేయదలచిన పనిని మానగలవారెందఱు? ముందు సుఖము రాగలదని ఇప్పుడు కష్టముల కోర్చుకొనగలవా రెందఱు?

ఫ్యూ క్యాన్ సో ఫోర్‌క్యాస్ట్ ది యియర్స్
టు ఫైండ్ ఇన్ లాస్ ఎ గెయిన్ టు మ్యాచ్,
ఆర్ రీచ్ ఎ హ్యాండ్ త్రు టైం టు క్యాచ్
ది ఫార్ ఆఫ్ ఇంటరెస్ట్ ఆఫ్ టియర్స్?

ఈ కారణమువల్లనే జనులు స్వార్థపరులై, దూరదృష్టి లేక అధర్మ కార్యములు చేయుట ఎంత సహజమో ధర్మబుద్ధి కలవారు అట్టి కార్యములను నివారించుట అంత కర్తవ్యమై యున్నది.

సుమారు 5 లేక 6 వందల సంవత్సరముల క్రిందటి వఱకు, ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ మొదలైన పశ్చిమ దేశములలో ఒక చిత్రమైన పద్ధతియుండెను. దేశములో గొప్ప వారును, గొప్పవారని పేరు పొందదలచినవారును, వారి ఇండ్లు వాకిళ్ళు వదలిపెట్టి ఒక గుఱ్ఱముమీద ఎక్కి ఆయుధ పాణులై సదా దేశముమీద తిరుగుచుండిరి. వారికి ఒకచోట అని లేదు, ఒకదారి ఒక మార్గము అని లేదు. ఆ సమయము నకు తోచిన త్రోవను పోవుచు దేశముమీద తిరుగుచు దుర్మార్గులతో పోరాడి ఓడించి దుష్కార్యములను నివారించు

చుండుటే వారిపని. వారు సామాన్యులుకారు. ప్రభువులు, ప్రభువుల బిడ్డలు, భూస్వాములు, ఆస్తి పరులు యిట్లు తిరుగు చుండిరి. ఎవరి ఇండ్లలో వారు తినుచు హాయిగాఉండలేకనా ? ఇట్లు దేశముమీద గస్తీతిరుగుటలో అనేక కష్టముల పాలగు చుండిరి. అనేక సందర్భములలో దుర్మార్గులే బలవంతులగు టచే వారిని ఓడించి చంపివేయు చుండిరి. అయినను ప్రజా క్షేమమును గమనించి వారు ఆపద్ధతిని విడువలేను. కొన్ని వందల సంవత్సరముల వఱకు ఆ పద్ధతి పశ్చిమ దేశములలో ప్రబలముగ నుండెను. రాజ్యముచేయు పద్ధతులు క్రమక్రమ ముగా వృద్ధిపొందిన వెనుక, అట్లు తిరుగుచుండుట అనవసరమై ఆపద్ధతి తగ్గిపోయెను.

అధర్మమును నివారించుటకొఱకు పాటుపడవలెననగా అందఱును కజ్జాకోరులుగ ఉండవలెననికాదు. కష్టనష్టములకు, నిష్ఠూరములకు ఓర్చుకొని ధర్మమునకు తోడ్పడుచుండవలెను. కాలుత్రొవ్వి పోరునకు పురికొల్పుట సత్పురుష లక్షణము కాదు. సామ, దాన, భేద, దండోపాయములలో పోరుకడపటిది. ఎవరిశక్తికొలది వారు ధర్మమును నిలబెట్టుటకును, అధర్మ మును అడ్డగించుటకును సదా ప్రయత్నించుచుండవలెను. ఖూనీలు జరిగినను ఋజువు కాకపోవుచున్నవి అని తరుచుగా వార్తాపత్రికలలో చదువుచున్నాము. ఇది మిక్కిలి విచారకర మగు సంగతి. ఏనేరము జరిగినను దానిని బైటబెట్టుటకు

ఆదరము తోడుపడవలెను. దానివిషయమై లెక్కించినవారంటును మొగమోటములు, నిష్ఠురములుచూడక పోలీసువారికి ఉన్న సంగతులన్నియుచెప్పుచు న్యాయమునకు తోడుపడవలెను. జూరర్లుగను, ఎసెసర్లుగాను సాక్షులుగను కూడినయెడల కష్టమని అనేకులు తప్పించుకొనవలెనని ప్రయత్నించెదరు. ఇది ధర్మవిరుద్ధము. న్యాయమునకు తోడుపడుట మిక్కిలి శుభమనియు, కర్తవ్యమనియు తలపవలెను. క్రిమినలు కేసులలోగాని, సివిలు కేసులలోగాని న్యాయస్థానములకు సాక్ష్యమునకై రాలకు వచ్చినప్పుడు తన లాభనష్టములుగాని ఇతరుల లాభనష్టములుగాని లెక్కచేయక సత్యముపలికి న్యాయమునకు తోడుపడవలెను. లేనియెడల అన్యాయప్రవర్తన ప్రబలిపోయి ప్రజలనందఱిని బాధించును.

సృష్టికర్త మనుష్యులకు మంచిచెడ్డలు విషముఖపయఃకుంభములు, పయోముఖ కుంభములుగ నుండునట్లు చేసియున్నాడు. ఎంత సుఖముగానున్నది అనుచు చేతపట్టిన కార్యము దుఃఖసముద్రములో ముంచుచున్నది. ప్రస్తుతము కష్టముగ తోచుకార్యము పిమ్మట సుఖమునిచ్చుచున్నది. ఫలముపై దృష్టిలేక ధర్మముపై మనకు ఆసక్తికలుగుటకే భగవంతుడిట్లు ఏర్పాటు చేసియున్నాడు. ధర్మముయొక్క ఫలముకాని అధర్మముయొక్క ఫలముకాని ప్రపంచమములో కనబడకుండునట్లు చేసెను. వాటి యథార్థఫలములకు వ్యతిరేకముగనే

ముందు కనబడునట్లు చేసెను. మిఠాయి పెట్టినప్పుడెల్లను అబ్బాయి మంచితనముగ ఉండినయెడల అది మిఠాయి మంచి తనమా కాని అబ్బాయి మంచితనమేమున్నది? ఆకలిగ నున్న ప్పుడు భోజనముటవల్ల ఎట్లు తృప్తి కలుగుచున్నదో మంచిపని చేసినప్పుడెల్లను సుఖముగ అనిపించునట్లు దేవుడు మనుష్యు లను సృష్టించి యుండవచ్చును. అట్లు సృష్టించియుండిన యెడల అందఱు ఎల్లప్పుడు మంచి పనులనే చేయుదురు. మర్యాదస్థులే ఉందురు. అయితే మనుష్యులలో ధర్మము అధ ర్మము అను విచక్షణ, కష్టనష్టము లను ఎన్నక ధర్మముమీదనే ప్రేమయుండుట, తటస్థించవు.

సామాన్యముగ జనులందఱును అహంభావముతో తమకు సుఖము నిచ్చునట్లుగానుండు పనులను చేయుచుందురు తమకు కష్టము కలుగజేయునట్లుగా తోచుపనులను చేయక విడిచివేయుచుందురు. ఈ అహంభావమును మానుకొని తన కష్టము, తనసుఖము అను మాటనే మఱచి తనకు కష్టమా సుఖమా అని యోచించక ధర్మము మీదనే ప్రేమకలిగి ప్రవర్తించుటయే ధర్మస్వరూపుడగు భగవంతుని యొద్దకు చేర్చు మార్గము. అట్లు ధర్మముమీద ప్రీతికలిగించుటయే మాన వజన్మముయొక్క ముఖ్యోద్దేశము.

ఈ విషయములో భగవంతుడు మూడుమెట్లుగా ఏర్ప ఱచియున్నాడు. దృష్టి ఎల్లప్పుడును తనమీదనే ఉండక

తన బంధుమిత్రులమీదకూడ కొంతప్రేమ ఉండునట్లుచేసెను. సాధారణముగ ఎంతదుర్మార్గునకైనను, ఎంతస్వార్థపరునకైనను తన భార్యబిడ్డలమీదనో, తల్లిదండ్రులమీదనో, అన్నదమ్ముల మీదనో, అప్పచెల్లెళ్ళమీదనో, ఎవరో ఒకరిద్దఱు స్నేహితుల మీదనో ప్రేమఉండును. ఇది పాలలో తోడువేసినట్లు సహజముగ భగవంతుడిచ్చినప్రేమ. పాలలో కొంచెము పెరుగును తోడుగావేసినచో ఆతోడుయొక్క గుణము క్రమక్రమముగా పాలంతయు వ్యాపించి, పాలంతయు పెరుగుగా మాఱవలెను. లేనియెడల పాలు తోడుకొనలేవు. పులిసిపోయినవి అని తూములో పారపోయుచున్నాము. బంధుమిత్రులపై సహజముగ భగవంతుడిచ్చినప్రేమ మొదటిమెట్టు.

అట్టిప్రేమ ఉండుటచే వారి విషయములో మాత్రము తమ అహంభావమును, స్వార్థ పరత్వమును మఱచి ప్రవర్తించెదరు. అయితే బంధుమిత్రుల విషయముగాక లెక్కలేని అనేక విషయములుండును. మిగత అన్ని విషయములలోకూడ అట్లే ప్రవర్తించుట రెండవమెట్టు. దీనినే భూతదయ అందురు. తోడువేయుటవల్ల పాలంతయు పెరుగుగా ఎట్లు మారునో, బంధుమిత్రులపై భగవంతుడు సహజముగ ఇచ్చిన ప్రేమచే క్రమక్రమముగా మనస్సు మారిపోయి, వారివిషయములోనే గాక సర్వ విషయములలోను అహంభావముతో ప్రవర్తించు అభ్యాసముపోయి, స్వార్థపరత్వము యొక్క నీచత్వమును

స్వార్థత్యాగము యొక్క సంతోషమును మనస్సునకు బోధ పడవలెను. సూర్యుడు ఉదయించిన వెనుక లోకమంతయు వేఱువిధముగ ఎట్లు కనబడునో భూతదయా ప్రబోధము మనస్సులో కలిగినప్పుడు అంత మార్పుకలుగును. అదివరకు బంధుమిత్రులను చూచినప్పుడు మాత్రము అహంభావ నిరసనములుకలుగుచుండినట్లు, అటు పిమ్మట ఏది చూచినను. ఎవరినిచూచినను తన అహంభావమును పోగొట్టుచు, సృష్టి అంతయు అహంభావమును పోగొట్టుటకు ఏర్పడిన గురువుగా ఉండును. ఈ విషయమునే ఆంగ్లేయ భాషలోను మన భాషలోను చెప్పియున్నారు.

లా ఇన్‌డీడ్ ఇజ్ లైట్ ఫ్రం హెవెన్
ఎ ఫీలింగ్ ఫ్రం ది గాడ్‌హెడ్ కాట్
టు వీన్ ఫ్రం సెల్ఫ్ ఈచ్ సార్‌డిడ్ తాట్.

అనగా ప్రేమఅనునది దేవునివద్దనుండి బయలుదేరి వచ్చిన వెలుతురువంటిది, తనపైనుండు దృష్టిమార్చుటకు దేవునివద్దనుండి గ్రహింపబడిన గుణము అని అర్థము.

హీ ప్రేయత్ బెస్ట్ వ్హూ లవెత్ బెస్ట్
ఆల్ తిన్‌గ్స్ బోత్ గ్రేట్ ఎన్‌డ్ స్మాల్
ఫార్ ది డియర్ గాడ్ వ్హూ లవెత్ అజ్
హి మేడ్ ఎన్‌డ్ లవ్‌స్ దెం ఆల్.

అనగా చిన్న పెద్ద అను భేదములేక సర్వజీవులపై ఎంత భూతదయ కలిగియుండునో అంత భగవత్ప్రీతిగా ప్రార్థించిన ఫలము కలుగును అని భావము. కీ సెవాంయించు నప్పుడు తీగకుచెయ్యి తగులగా ఆతీగ రమ్యమైన ధ్వని చేయుచు కంటి కగపడకుండ చెదరిపోవునట్లు జీవాత్మకుప్రేమ తగిలినప్పుడు అహంభావము కష్టమని తోచక సంతోష పూర్వకముగనే పోవును. అని ఈ క్రింది పద్యముయొక్క భావము.

లా టుక్ అప్ ది హార్ప్ ఆఫ్ లైఫ్
ఎండ్ స్మోట్ ఆన్ ఆల్ ది కార్డ్స్ విత్ మైట్
స్మోట్ ది కార్డ్ ఆఫ్ సెల్ఫ్ దట్ ట్రెంబ్లింగ్
పాస్డ్ ఇన్ మ్యూజిక్ ఔట్ ఆఫ్ సైట్.

భూతదయవల్ల అహంభావము నశించి మోక్షము కలుగుననియే అపారమైన భూతదయా ప్రబోధము తన మనస్సునందు కలుగువలెనని ఇట్లు ప్రార్థించుచున్నాడు.

"నీ పాదకమలసేవయు,
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును,
తాపసమందార నాకు దయసేయగదే."

మన దేశమునుద్భవించి ప్రపంచమందితర దేశములకును వ్యాపించిన బౌద్ధమతములో ఈభూతదయయే ముఖ్యాంశము.

భూతదయ మిక్కిలి శ్రేష్ఠమైనగుణము. అయితే భూతదయ యును ఒక బంధమే. భరతుడు భూతదయవల్ల లేడికి సంసారములో పడినట్లు అది ప్రారంభములో జీవాత్మయొక్క అభివృద్ధికి తోడుపడును పిమ్మట అడ్డుపడును. సర్వవిషయ వస్తువులందును ఆసక్తినివిడిచి అచ్చముగా ధర్మముమీదనే ఆసక్తికలిగియుండుట మూడవమెట్టు. సృష్టిఅంతయు పరస్పర వైరములతోను పోరాటములతోను నిండియున్నది. ఇట్లు పిల్లి ఎలుక పులి మేక ద్వంద్వములతో నిండియుండు సృష్టిలో అచ్చముగా భూతదయమాత్రము మన అనుదినప్రవర్తనమునకు అన్ని సందర్భములందును మనకు మార్గదర్శకము కాజాలదు. ధర్మమార్గ మిట్టిది అని తెలిసికొని సర్వసంగపరిత్యాగియై ధర్మముపైమాత్రము గురికలిగి ప్రవర్తించుట మూడవమెట్టు. రోము దేశములో బ్రూటస్ అను గొప్ప అధికారియుండెను. అతని కుమారునిపై ఒక గొప్ప నేరము మోపబడి విచారణ జరిగి ఋజువులయ్యెను అతడు కోర్టులో తనకుమారునకు తానే మరణశిక్ష విధించెను. భూతదయ అనుటకు ఒక కుక్కనుగాని పిల్లినిగాని పెంచుటకాదు. తనకుపుట్టి తన చేతులార పెద్దవాడగునట్లు పెంచిన తన కుమారునే ధర్మమార్గముపైనుండు ప్రేమచే తన చేతులారచంపిశవముగా ఇంటికి రప్పించుకొనెను. ధర్మముపై పూర్తిగా ప్రేమకలిగినప్పుడు తను కష్టసుఖములపై దృష్టి పూర్తిగా తప్పిపోయి, జటాయువువలె తమ ప్రాణము

లను సహజ ధర్మములను సంరక్షించుటకై ఇచ్చివేయుటకు సిద్ధముగ నుందురు.

మొదటిమెట్టుపై నున్నప్పుడు తన బంధుమిత్రులపై మాత్రము ప్రేమయుండును. రెండవమెట్టుపైకి వచ్చినప్పుడు భూతదయచే తన బంధుమిత్రులకు కష్టముకలుగు పనులు చేయవచ్చును, మూడవమెట్టుపైకి వచ్చునప్పుడు ధర్మముపై ప్రేమచే భూతదయకును విరుద్ధమైన పనులుచేయవచ్చును. ఈ మూడును వ్యతిరేకములుగ కనబడవచ్చును. కాని వ్యతిరేకములు కావు. తనయందు పూర్తిగా గురియుండుటమాని ఇతరులపై కొంత ప్రేమకలుగుట, భూతదయ కలిగి తనపై గురి పూర్తిగాపోయి అహంభావము నశించుట, అహంభావము నశించిన వెనుక తనకు ప్రియముగానుండు పనులుమాని ధర్మముపై పూర్తిగా ప్రేమకలిగి భగవత్ప్రీతియగు కార్యములను చేయుట, ఇదియే ఈ మూడుమెట్లకును సామాన్య లక్షణము కొంచెము ఇంగ్లీషు వచ్చినవారు కొందరు మేము డ్యూటీ చేయుచున్నాము అనుచు తమకు కష్టమైనపనులు చేయక పోయినను ఇతరులకు ఇబ్బందులు కలిగించి కష్టపెట్టు పనులను మాత్రము చెత్తమాడునట్లు చాల ఖచ్చితముగా చేయుదురు. ఇది డ్యూటీ చేయుట కాదు. అహంభావము విజృంభించుట. అహంభావము నశింపవలెను. అహంభావముతో ఏపని చేసినను పాపమే కాని పుణ్యము కలుగదు.

గుఱ్ఱపుబండి రోడ్డుమీద పోవుచుండుట అందఱు చూచియేయుందురు. గుఱ్ఱము బెదరినప్పుడు బండితోసహా పారి పోవుటను చూచినారా? ఏ కొరడాతో కొట్టినప్పుడును అంత వేగముగ పోదు. పిచ్చి పట్టినట్లు ఒడలు తెలియక ముందు వెనుక చూడక అతివేగముగ పరుగులెత్తి దేనిమీదనైన పడి తనకును దెబ్బ తగిలించుకొనును. బండి ముక్కలు చెక్కలగు నట్లు చేయును. అందులో ఉండువారికి మొప్పము కలిగించును. పంచేంద్రియములు, మనస్సు ఇవి ఆరు బలముగల శ్రేష్ఠమైన గుఱ్ఱములు, ఇవి మనచేతిక్రింద ఉంచుకొన •గలిగినయెడల మనకు మిక్కిలి ఉపయోగకరముగ పనిచేయుచు మోక్ష మార్గమున అతి వేగముగ ప్రయాణము చేయుచు ముక్తి పద విని శీఘ్రముగ పొందునట్లు చేయును. వీనిని మన స్వాధీన ములో ఉంచుకొనలేక, వీని చేతులో మనము పడిపోయిన యెడల, మనకు పరమశత్రువులై, విచ్చల విడిగా పరుగెత్తుచు ఏ గోతులలోనికైన యీడ్చుకొనిపోయి పడవైచును.

"లోకములన్నియుఁ గడియలోనజయించినవాడవింద్రియా
నీకముజిత్తముఁ గెలువనేరవునిన్ను నిబద్ధుజేయు నీ
భీకర శత్రులాఱ్వుల బ్రభిన్నులజేసిన ప్రాణికోటిలో
నీకు విరోధిలేడొకడు నేర్పునజూడుము దానవేశ్వరా."

ప్రతి మనుజుడును ఎల్లప్పుడు తన కష్టము తన సుఖము అనుచు అహంభావముతో ప్రవర్తించక, ఉదయము నిద్ర



లేచి కాలు క్రింద పెట్టినది మొదలు రాత్రి ని ద్రించువఱకును తాను చేయు ప్రతికార్యములోను తనకష్ట సుఖములను లెక్క చేయక భగవంతునకు ప్రీతికరముగునట్లు ప్రవర్తించుచుండుట ఇదియే భక్తి. అప్పుడప్పుడు దేవుడా, దేవుడా యని నాలుగు పెద్ద కేకలు పెట్టుచు, చేసెడు పనులన్నియు ఎప్పటివలెనే చేయుచుండుట భక్తికాదు. చిన్న పనులుకాని పెద్ద పనులుకాని, మామూలు పనులుకాని విశేషమైన పనులుకాని, ఇహమును గూర్చినవి కాని, పరమును గూర్చినవి కాని, జాగ్రదవస్థలో ప్రతి నిముషమును ప్రతి క్షణమును, ప్రతి సందర్భములోను, ధర్మమార్గమేది అని విచారించుచు ధర్మమార్గమునే అవలంబించి నడుచుకొనుట-ఇదియే భక్తి. సర్వ విషయములలోను మన ఇచ్ఛను విడిచి భగవదిచ్ఛను అనుసరించి ప్రవర్తించుచుండుట-ఇదియే భక్తి. ఇట్లు చేయువారే భక్తులు.

---

# రామ రావణ యుద్ధము.

సృష్టియందేది చూచినను, ఎక్కడ చూచినను, పరస్పర భేదములుకల ద్వంద్వములున్నవి. రాత్రి పగలు, ఎండ నీడ, వేడి చలి. ఈవిధముగా అనంతములైన విషయ వస్తువు లున్నట్లే అనంతములైన ద్వంద్వములున్నవి. ఈ పరస్పర తారతమ్యములు ఒకదానిపై నొకటి ప్రసరింపజేయుచుండుట

వల్లనే, సృష్టిఅంతయు ఒక చిత్రపటమువలె చలనరహితముగ నుండక, అద్భుతమైన చాకచక్యము, క్షణక్షణమునకు వివిధ రూపములు,అనంతములైన మార్పులు కలదైయున్నది. ఏనాటకములు, ఏబయస్కోపులు, సినీమాలు, సర్కసులు అంతచిత్రముగను, అంతవినోదకరముగను, అంత అద్భుతముగను యుండవు. అయితేదానినిచూచుటకు శాస్త్రజ్ఞానముండవలెను చదువురానివానికి యీ పేజిచూడగా ఏదో నల్లగా తెల్లగా గీతలుమాత్రము కనబడును. చదువువచ్చినవానికి యీ పేజి అంతయు వేఱువిధముగతోచును. ఇట్లే శాస్త్రజ్ఞానము కలవారికి సృష్టిలో ప్రతిదినమును మనము చూచుచుండు సర్వమును వేఱువిధముగ కనబడును.

లోకుల కక్షిశాస్త్రమయ్యది
అలవడ దెవ్వనికివాడ అంధుడు జగతిన్.

అనుమాట సత్యము. చెరువులు నదులు నిండునట్లు జోరున వర్షము కురుయుచున్నను మనవద్ద ఒకపాత్రలేని యెడల దాహము తీర్చుకొనుటకుకూడ కొంచము నీరు చేర్చుకొనజాలము. సృష్టికర్త మహిమను సృష్టి వెయ్యినోళ్ళతో తెలుపుచున్నను మనకు శాస్త్రజ్ఞానము లేనియెడల దానిని కనలేము వినలేము. భగవంతుని శక్తి మనయందును మన చుట్టును అపార ప్రవాహములుగ నిండియున్నను విద్యవల్ల

కలుగు పాత్రతలేనివారు దాని నుపయోగించుకొన జాలక బలహీనులై దుర్దశాయత్తులైయుందురు.

రాజుగారు రాజగృహమునందుండి అప్పుడప్పుడు ప్రజల కగపడుచుండునటు భగవంతుడొకచోటనుండి తనభక్తులకు బహుమతులు భాగ్యములు పంచుచుండినయెడల నందఱును భక్తులై దుర్మార్గులే యుండరు. అట్టి సందర్భములో భక్తులుగ నుండుట ఒక గొప్ప విశేషము కానేకాదు. అదునల్లనే భగవంతుడు మన పంచేంద్రియములకును మనస్సునకును పూర్తిగా అదృశ్యుడై యున్నాడు. అయితే దేవుడు కనబడక యున్నను ఆయన యీసృష్టిని నడుపుచు చేయుచున్న పనులు చూచుచున్నాము.

చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు భవలతా లవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్

అని భగవంతుని చరిత్రలను వర్ణించిరి. భగవంతునిచరిత్ర లెప్పుడో పూర్వపు రోజులలో జరిగిపోయెననుకొన వద్దు. ప్రతిదినము ప్రతిక్షణము మనకంటియెదుటనే భగవంతునిచర్యలు జరుగుచున్నవి. ఒకగింజ చెట్టుగుటెంత అద్భుతము. ఒకచెట్టు పూలుపూయుటెంతఅద్భుతము. పువ్వులనుండి పండ్లు కలుగుటెం

తఅద్భుతము. వృక్షశాస్త్రములోనే ఇంతకన్న అద్భుతమైన వెన్నియోవిశేషములున్నవి. వృక్షములేగాక సృష్టిలో అనేక వివిధవస్తువులున్నవి. లెక్కలేని శాస్త్రములున్నవి. ప్రతిదిన మును నియమితవేళలకు సూర్యుడుదయించుట, అస్తమించుట యెంతఅద్భుతము ఇట్టివనేకములు మనకనుదినము కనబడు చుండుటచే వింతలుగా తోచుట మానినవి.

జూలిస్ వెర్నె అను ఫ్రెంచికవి క్యాప్టెన్ హ్యాట్రాస్ అను నవలను వ్రాసెను. అందొక చిత్రమైన పరిస్థితినివర్ణించెను. మహాసముద్రముమీద ఒక గొప్ప ఓడ పోవుచున్నది. దాని నిండ మనుష్యులు సామగ్రులు నున్నవి. అయితే దానిని నడుపువాడెవడో అధిపతియెవడో యెవరికిని తెలియదు. ప్రతిదినమును ఉదయమున అందఱు నిద్రలేచుసరికి క్యాప్టెను గదిలో బల్లమీద ఒకకాగితముండును. ఆకాగితముమీద ఆరోజున పడవను ఫలానవిధముగా నడిపించవలెనని వ్రాసి యుండును. పడవ అట్లే నడిపించబడుచుండెను.

పూర్వకాలమున ఎశీరియనులు అనువా రనేకదేశముల నోడించి గొప్ప సామ్రాజ్యము నేర్పరచిరి. ఆరోజులలో రాజాధిరాజొక గొప్ప విందుచేయుచుండెను. హాలు అనేక లైట్లతోనిండి పగటికంటె కళగనుండెను. మంగళవా ద్యములతోను, సంభాషణలతోను, నవ్వులతోను హాలంతయు

నిండియుండెను. అట్టి సందర్భమున చప్పున నంతయు నిశ్శబ్ద మయ్యెను. వ్రాయునట్టి చెయ్యికనబడదు, వ్రాయునదెవరో తెలియదు కాని గోడ మీద "బంగారువలెనుండిన మీ మన స్సులు మన్నువలెనైనవి. మీరాజ్యమును మన్నుకానున్నది." అను భావము స్ఫురించునట్లు వారిభాషలో వ్రాయబడెను. ఇదిచూచి యెక్కడి వారక్కడ నిశ్చేష్టితులైరి. తెల్లవారు లోననే వారిరాజ్యము శత్రువులపాలై నశించెను.

ఇట్లే భగవంతుడు మనకు కనబడడు కాని మనయందును మనచుట్టును,

అభయదానశస్త్రము ననర్గళమంగళ హేతుహస్తముగ

అని వర్ణింపబడిన ఆయన చేతిమహిమతో సర్వము నిండి యున్నది. మన మనస్సుల కర్థమగునట్లుగా నిట్లు చెప్పుటయే గాని భగవంతుడు మనవలె నుండుననియు ఆయనకు చేతులు కాళ్ళు గలవనియు అను కొనగూడదు. భగవంతుడు విష యాతీతుడు. పంచేంద్రియములవల్లను, మనస్సువల్లను విష యవస్తువులను గ్రహించవచ్చును గాని భగవంతుని తెలుసు కొనజాలము. ఆత్మజ్ఞానము కలిగినవారు తాము తెలుసుకొన వచ్చునుగాని తిరిగి వారినోటితో మన మనస్సులకు బోధపడునట్లుగా "భగవంతుడిట్లుండును" అని చెప్పుటకు వీలు లేదు. ఈవిషయమునే గ్రహించి మనపూర్వులు వేదములలోనే

భగవంతుని ఎట్లు వర్ణించినను "నేతి, నేతి" అనగా ఇదికాదు ఇదికాదు అని చెప్పవలసినదేనని. బౌద్ధమతమును స్థాపించిన గౌతమబుద్ధుడు భగవంతుని మాటయే చెప్పలేదు. భగవంతుడు లేడని ఆయన అభిప్రాయమా? కాదు. భగవంతునిగురించి మనము మాట్లాడజాలమని ఆయన విషయమేమియు చెప్పక సృష్టి యెట్లుధర్మనియమముల ననుసరించి నడుచుచున్నదో అట్లు ధర్మమును గ్రహించి ప్రవర్తించుడు మోక్షమునకలుగునుఅని బోధించెను. ఈవిషయమును మఱచి సిమ్మట వచ్చినవారనేకు లనేక విధములుగ చెప్పుటవల్ల ప్రజలలో అనేకాభిప్రాయభేదము లేర్పడిదేవునకు నాలుగు చేతులున్నవని కొందఱు, రెండు చేతులేయున్నవని కొందఱు, భార్యబిడ్డలు లేరనికొందఱు, ఇద్దరు భార్యలున్నారని కొందఱు, ఒక కొడుకుకూడా యున్నాడని కొందఱు, కొడుకు లనేకులున్నారని కొందఱు, దేవుడు ఏయే విధమైన బొట్టుపెట్టు కొనుననియు, ఇట్లభిప్రాయభేదములు పడుటయే గాక ఒకరితో నొకరు తీవ్రముగ పోరాడుచు తలలు బద్దలుకొట్టుకొనుచుండుట మన దేశమున కంతయు సిగ్గుచేటుగా నున్నది. పూర్వకాలములో మన దేశమునందు చిన్నపిల్లలుకూడ యిట్లు ప్రవర్తించి యుండరు. "గుడ్డివాలు ఏనుగును లోబడు తెరువులు నెవ్వెదరు" అనినట్లు, మన మనస్సులకు తోచలేని విషయములలో నితరులమాటలను వినుట

వా రభిప్రాయములకు లోబడుటయేగాని వేఱుపయోగము లేదు.

భగవంతుడు మనకు కనబడకపోవుట వల్లనే, సృష్టిలో ఆతడు చేయుపనులను గమనించి, అతడేమేమి చేయుచున్నాడో, సృష్టినెట్లు నడుపుచున్నాడో గ్రహించుట మఱింత ముఖ్యావసర మగుచున్నది. ఆత్మజ్ఞాన మందఱకు రాదు. సామాన్యులమైన మనము ఆయనను తెలుసుకొనలేక పోయినను సృష్టియందలి ఆయన పనులను తెలుసుకొనగలము, తెలుసుకొన వలెను. సృష్టినంతయు అడ్డగోలుగా గాక కొన్ని పద్ధతుల కొన్ని నియమములననుసరించి నడుపుచున్నాడు. వీనినే సృష్టిధర్మములందురు. ఏ వస్తువైనను యే పద్ధతుల ననుసరించి నడుచుకొనుచున్నదో తెలిసినయెడల ఆజ్ఞానమువల్లనే అది మనకు వశమగును. సృష్టియందలి సర్వవిషయము లెట్లెట్లు నడుచుకొను చున్నవో తెలుపుటకే ఆయాశాస్త్రము లేర్పడి యున్నవి. జంతువులను గురించి తెలుపుటకు జంతు శాస్త్రము, వృక్షములను గురించి తెలుపుటకు వృక్షశాస్త్రము, వైద్యమును గురించి తెలుపుటకు వైద్యశాస్త్రము-ఇట్లు వివిధ విషయములను గురించి తెలుపు వివిధ శాస్త్రములున్నవి. ఏ విషయములను బోధించు శాస్త్రములను నేర్చుకొందుమో ఆ విషయముల ప్రవర్తన మనకు తెలిసి అవి మనకు వశమగును. అట్టి జ్ఞానమువల్లనే శక్తికలుగును.

మిట్టమధ్యాహ్న మెండలో నిలిచియున్నను "సూర్యు డేడి" అని అడుగువానికి మనమేమి బదులు చెప్పగలము. "పాపము, వీడంధుడుకద" అని వేఱు విషయములను గురించి మాట్లాడ పూనుదుము. శరీరమునకు కండ్లున్ననే సర్వము కనబడునట్లు ఆత్మజ్ఞానమున్ననే భగవంతుడున్నాడని తోచును, మోక్షము కలుగును. అట్టిజ్ఞానము కలుగుట భగవంతునికృపచే కలుగవలెనుకాని మన యిచ్ఛచే వచ్చునది కాదు. సృష్టియందు భగవంతుడెట్లు వర్తించుచు, దానిని నడుపుచున్నాడో తెలుసుకొనుటమాత్రము సర్వజనులకు సాధ్యము, కర్తవ్యము. దేవుడు మనకనులకు కనబడనప్పుడు, మనము శాస్త్రజ్ఞానముచె పొంది సృష్టిలో దేవుని చర్యలనైనను కనిపెట్టిచూచి గ్రహించుట మిక్కిలి కర్తవ్యము, యిహాపరములను సాధించుమార్గము. ఆత్మజ్ఞాన బోధ కలవారికిని లేనివారికిని, దేవుడున్నాడని నమ్మువారికి నమ్మని వారికిని, శాస్త్రజ్ఞానము పొందినవారందఱకును సృష్టివిధానములు తెలిసి అపరమితమైన శక్తికలుగును. అయితే ఆత్మజ్ఞానమున్నవారు "హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు, హరిమయముకాని వస్తువు పరమాణువు లేదు" అను సంగతినికూడ గ్రహించి, సృష్టియంతయు భగవంతుని మహిమగాచూచిచూచి, శక్తినేగాక ముక్తినికూడ పొందెదరు.

ముక్తినికోరువారూరకకూర్చుండి దేవుడా, దేవుడా, అనుకొనుచుండుటవల్లనే అది వచ్చునని యెన్నకూడదు. విద్య పొందవలెను. శాస్త్రజ్ఞానము పొందవలెను. సృష్టినిభగవంతు డెట్లు నడిపించుచున్నాడో, సృష్టియందు భగవంతు డెట్లువర్తించుచున్నాడో చూడవలెను. విద్య, శాస్త్రజ్ఞానము కూటి కొరకే అనుకొనకూడదు. ఎక్కడైన పనిదొరుకును, ఉద్యోగములభించుటకు అని అనుకొనకూడదు. భగవంతుని చర్యలు, భగవంతుని పనులు, భగవంతునిసంగతులు తెలియనివారు భగవంతునిగూర్చి యేమని ధ్యానము చేసెదరు, యేమని తపస్సుచేయగలరు ? వారికి యదార్థములేమి తెలియునని యేమితోచగలవు ?

లక్ష్మీనాథు చరణకమల
ధ్యానంబున నెవ్వడయిన ధన్యతనొందున్.

అనువాక్యము సత్యమే కాని దానిఅర్థమేమి ? సృష్టిని నిరాకరించి కన్నులుమూసుకొని జపము చేయుటా ?

మనపూర్వులు అన్నివిద్యలును, అన్నిశాస్త్రములను గ్రహించిరి. వారికిరానివిద్యలులేవు, వారుపొందని శాస్త్రజ్ఞానములేదు. సృష్టిలో వారు తెలిసికొనని విషయములులేవు. వెనుక హిందూరాజులకాలములో నిర్మింపబడిన ఒక పెద్ద యినుపస్తంభము ఢిల్లీలో యిప్పటికిని యున్నది. అనేక శతా

ద్రములు జరిగిపోయినను దానికి తుప్పుపట్టలేదు. దానిమీద చెక్కిన అక్షరములింకను స్పష్టముగనున్నవి. వానలలో తడి యుచు యెండలలో యెండుచు ఆరుబైటయున్నను తుప్పుపట్ట కుండ యెట్లుచేసిరోఅనియు, అంతపెద్ద యినుపస్థంభము నెట్లు నిర్మించిరోఅనియు యీరోజులలో పశ్చిమ దేశముల శాస్త్ర జ్ఞులుకూడ ఆశ్చర్యపడుచున్నారు. దానిసంగతి యెవరును కనుగొనలేకున్నారు. మన పూర్వులు శాస్త్రజ్ఞానమున కిది యొక దృష్టాంతముగ నున్నది. అన్నివిద్యలను తెలుసుకొని అన్నిశాస్త్రములను గ్రహించి, యేబది సంవత్సరముల ప్రాయమువచ్చువరకు సంసారములు చేయుచు ప్రపంచమంతను తిరుగుచు సృష్టిని తిరగబోర్లతీసిచూచి, పిమ్మట వనములకేగి తపస్సులుచేయగా అద్భుతజ్ఞానముగలిగి సర్వజ్ఞులైరి. సృష్టి విధానములేమియు తెలియక, తెలిసుకొనలేని, గాఢాంధకార ములో నుండగా, సృష్టిని నిరాకరించి ధ్యానము వల్ల భగవం తుని తెలిసికొనవచ్చునని యెవరైన చెప్పిన యెడల పకపక నవ్వియుందురు. ఏమియు తెలియని పసిబాలురగు ధృవునకు ప్రహ్లాదునకు మోక్షమెట్లు కలిగినదనిన, మహాఋషుల ఉప దేశమువల్ల కలిగెను. కాని వారి స్వతంత్రప్రయత్నము వల్లనే కాదు. సామాన్యజనులు ముక్తికావలెనన్న ముందు విద్యను, శాస్త్రజ్ఞానమునుపొంది భగవంతుడు సృష్టియందెట్లు వర్తించు చున్నాడో, సృష్టినెట్లు నడుపుచున్నాడో విచారించి సృష్టి

విధానములను తెలుసుకొనవలెను. సృష్టిలో లేని దేవుడెక్కడో దూరమున లేడు. భగవంతుని చరణకమలములను గురించి ధ్యానించుటనగా నిదియే. సృష్టిజ్ఞానములేక మూలకూర్చుని ధ్యానముచేసినయెడల నేదయ్యామో దేవుడు వేషముతో కనబడును. దాఖలా కనబడినదని సంతోషించి పోవిపోకురు.

ఆఫెక్ స్ట్రైన్ టు విన్ అజ్ టు అవర్ హార్మ్
డి ఇన్‌స్ట్రుమెంట్స్ ఆఫ్ డార్క్‌నెస్ టెల్ అస్ ట్రూత్స్
విన్ అజ్ విత్ ఆనెస్ట్ ట్రైఫిల్స్ టు బిట్రే అజ్
ఇన్ డీపెస్ట్ కాన్‌సిక్వెన్స్.

భగవద్విధానములు తెలుసుకొనుటవల్లనే పూర్వపురోజులలో భక్తిపరులగు ఋషులును, భక్తిలేని రాక్షసులును, ప్రస్తుత కాలములో దేవుడున్నాడని నమ్మకములేని పశ్చిమదేశస్థులును అద్భుతమైన శక్తులనుపొందిరి. ఇదిచక్కెరఅని పేరు తెలియక పోయినను దానిని సేవించినప్పుడు దానిగుణ మనుభవమగును.

మన పూర్వులు కనిపెట్టిన శాస్త్రములు విద్యలు అన్నియు నశించినవి. వానివల్ల వారెంత గొప్పతనను పొంది, యెంత బలవంతులుగ నుండిరో అవి లేమిచే మనకంత హీన దశకలిగి బలహీనముగ నున్నాము. అయినను మన మధైర్య పడ నవసరములేదు. వారు నేర్చిన మార్గముననే మనమును నేర్చుకొన వచ్చును. వారికి బోధచేసిన భగవంతుడే మన

కును గురువై యున్నాడు. కంటికి కనబడక బోధచేయుగురువు, నేర్చుకొనమని బాధపెట్టని గురువు. ఉపాధ్యాయుడు మొద్దు పిల్లలకు తెలియువరకు తిరిగితిరిగి చెప్పునట్లు, సృష్టి విధానములను భగవంతు డిదివరకు వారికి, యిప్పటి వారికి, ముందు రాబోవు తరములవారికి, ఎల్లకాలము నొకే విధముగ జరిపించుచు బోధ చేయుచున్నాడు. ఒకగింజ మొలకెత్తుట యిప్పుడైనను యెప్పుడైనను యెల్లప్పుడు యెన్నిసార్లు జరిగినను ఒకే విధముగ జరుగుచున్నది. ఇదే విధముగనే సృష్టిలో సర్వమును జరుగుచున్నది. "ఇదివరకు చూడకపోతే, ఈసారి చూచి నేర్చుకో, ఈ సారికూడ తెలియకపోతే యిదిగో యింకొకసారిచూచి నేర్చుకో" అనుచున్నట్లు భగవంతుడు విసుగు విరామము లేక తిరిగితిరిగి అదే పనులను అదే విధముగా జేయుచున్నాడు. మనదృష్టి అటుపోవుటయే ఆలస్యము. సృష్టిపై అక్కర కలిగి సృష్టి ధర్మములను గ్రహించవలెనని బుద్ధిపుట్టుటయే ఆలస్యము. సృష్టి ధర్మముల జ్ఞానముచే సర్వశక్తులును, సర్వ శుభములును కలుగును.

ఒకతూము ద్వారా నీరు వచ్చునప్పుడు ఆతూముయొక్క మలినముతో చేరి వచ్చును. ఒకరు చెప్పుమాటపూర్తిగా సత్యముగ నుండుట దుర్లభము. వారి స్వంత అభిప్రాయముల తోచేరి యుండును. చెప్పువారికొక అర్థముగ నుండగా వినువారి కింకొక అర్థముగ తోచవచ్చును. సాక్షాత్తుగా

సృష్టినిచూచి ఎట్టి ప్రవర్తన సృష్టి ధర్మముల కనుగుణ్యముగ నుండునో, యెట్టి ప్రవర్తన తదనుగుణ్యముగ నుండదో తెలుసుకొన వలెను. తెలుసుకొనలేని వారెల్లకాల మితరులపై నాధారపడి యుండవలసి వచ్చును. 5000 సంవత్సరముల ముందుండిన మన పూర్వుల మాటలకైనను, 5000 మైళ్ళ దూరముననుండు ఇంగ్లీషువారి మాటలకైనను లోబడి యుండుట హానిసత్వమే. చిన్నదృష్టాంతములు. పరిశుభ్రము కొరకు మడి అని యేర్పడియున్నది. పూర్వాచారపరాయణులు దాని భావమును గమనించరు. వారుపయోగించు మడిబట్టలు సాధారణపుబట్టలకంటెమురికిగానుండును. ఊరికనీటిలోముంచి ఆరవేసిన బట్టలమురికి హెచ్చునుగాని తగ్గదు నవనాగరికులీ పద్ధతినే విడిచివైచి బజారుబట్టలతోను బూట్సుతో సహా వంటయిండ్లలోనికిపోయి తినుచున్నారు. అట్లే, పశ్చిమదేశస్థులు చేయుటలేదా అని అనేకులు మంచిచెడ్డలను విచారించి నిర్ధారణ చేసుకొనక వారిదురభ్యాసములను అవలంబించుచున్నారు. ఎంత గొప్పవారుచెప్పిన మాటలనైనను, ఎంత పూర్వాచార పద్ధతినైనను విమర్శించి, రాజహంసలు నీటినివిడిచి పాలను స్వీకరించినట్లు, సృష్టిధర్మముల కనుగుణ్యమైన దేదియో తెలుసుకొని దానిని మాత్రము స్వీకరించవలెను. "ఇట్లందఱును చేయగలరా"అన వచ్చును. అందఱును చేయ ప్రయత్నించవలెను. అభ్యాసమువల్ల చేయగలరు. చంటిబిడ్డలు ముందుతూలి

పడినను క్రమక్రమముగా తమ కాళ్ళమీద నిలిచి నడుచుట లేదా. అట్టి ప్రయత్నము, అభ్యాసము, లేని జనులెల్లప్పుడు పరుల యోచనలకులోబడి, సృష్టినిచూచి నేర్చుకొని అభివృద్ధి పొందజాలరు. వారికి హీనస్థితి తప్పదు.

చెట్లమధ్య నివసించునట్లు సృష్టిమధ్య మనముండుటే గాక, ఆకులు కొమ్మలు చెట్లలో భాగములై యుండునట్లు మనము సృష్టిలో నొకభాగమైయున్నాము. అందువల్లనే సృష్టిధర్మములు తెలిసికొనుట మనకు ముఖ్యము. వాటిని గురించి యింత చెప్పియున్నాము. పరస్పరవ్యతిరేక స్వభావములుగల ద్వంద్వములనేకములు సృష్టియందంతటను వ్యాపించి యుండునట్లే మనుష్యులయందును మంచి, చెడు అను ద్వంద్వముండి దానివల్ల

అన్ ఫ్లిం చింగ్ ఫుట్ గె స్ట్ ఫుట్ వాజ్ సెట్
అన్ సీజింగ్ బ్లో బై బ్లో వాజ్ మెట్

అనునట్లు నిరంతరమును అతితీవ్రమైన యెడతెరపు లేని పోరు జరుగుచుండును. మంచివారెల్లప్పుడును యితరులతో పోట్లాడుచుందురనిగాని, పోట్లాడవలెననిగాని దీనిభావము కాదు. ధర్మముకొఱకితరులతో పోరాటరావచ్చును, మనుష్యులలో ఓనివల్ల పోరుకలుగవచ్చునుగాని, మనుష్యులలో పోరుండుట దీనిముఖ్యస్వభావము కాదు. ఇదిముఖ్యముగ గుణ

ములపోరాట. మంచిగుణములు, చెడుగుణములు సదా పోరాడు చుండును. మనుష్యుని మనస్సును స్వాధీనము చేసుకొన జూచుచుండును. మనము నిద్రించునప్పుడు సహితము మింపో రాగదు. అందువల్లనే మనము ప్రతిదినము నిద్రించుటకు పూర్వము

మెర్సిఫుల్ పవర్స్
రిస్ట్రెయిన్ ఇన్ మి ది కర్సెడ్ తాట్స్ దట్ నేచర్
గివ్స్ వే టు ఇన్ రిపోజ్

అనగా చెడు తలంపులను మనస్సులో చేరకుండునట్లు కాపాడమని భగవంతుని ప్రార్థించుటకర్తవ్యము. అట్లే ఉదయము నిద్రలేచినవెరుక రాత్రియందు కల్మషగుణములుచేరి యుండినయెడల హరించునట్లు హరినిధ్యానించుట కర్తవ్యము.

ఒక సత్రములో నేడందఱు మంచివారుచేరి యుండవచ్చును; రేపు అందఱు చెడ్డవారుచేరి యుండవచ్చును. ఏ దినము చూచినను కొందఱు మంచివారు కొందఱు చెడ్డవారు యుండవచ్చును. "ఇది మంచిసత్రము" "ఇది చెడ్డసత్రము"అని సాధారణముగ దానియందు చేరుచుండు మనుష్యులను బట్టి మాటవరుసకు లోకులు అనుచుండ వచ్చునుగాని మంచిగాని, చెడ్డగాని సత్రములో లేదు. అందు చేరియుండు మనుష్యులనుబట్టి యుండును. ఇట్లే మనుష్యులయందు సాధారణముగ

నుండు గుణములను బట్టి యొకడు మంచివాడనియు, యొకడు చెడ్డవాడనియు నంగురుగాని, ఇది మాటవరుసకు అనుటయే గాని మనుష్యులందఱును ఒకే విధమని గ్రహించవలెను. దుర్మార్గు లెవరో అంటరానివారని తలచి వారిని దూరముగ నుంచకూడదు, యుంచుటకువీలులేదు. గుణములనుబట్టియే భేదము. నేడుండినగుణములు రేపుండక పోవచ్చును. ఏనాఁ డెవరి హృదయములలోచూచినను కొన్ని మంచిగుణములు, కొన్ని చెడ్డగుణములు నుండవచ్చును. పూర్తిగా చెడుగుణ ములుగాని, పూర్తిగా సద్గుణములుగాని యుండువా రరుదు. తనయందును, యితరులయందును, దుర్గుణములను, దుర్మార్గ మును, దుష్టత్వమును నిర్మూలింపవలెనని సదా ప్రయత్నించు చుండవలెను గాని దుర్జనులను నిర్మూలింపవలెనని సరాసరి ప్రయత్నించు టనుచితము, అక్రమము. మనపోరు దుర్మార్గ ముతో గాని దుర్మార్గులతో కాదు.

మనమెంత ప్రయత్నించినను దుర్మార్గమును పూర్తిగా నిర్మూలింప జాలము. మంచి చెడుగుల ద్వంద్వము సృష్టి నిర్మాణములో నొక అంశము. దానిని తొలగించుట మన కశక్యము. దుర్గుణములు మన మనస్సులయందు చేరకుండు నట్లు సదా ప్రయత్నించుట, యితరులయందు మన శక్తికొలది నిరసించుట నిరోధించుట-యింత మాత్రమే మనము చేయ గలము, చేయుట కర్తవ్యము, "శ్రీవరదుడెకర్త సకల జీవుల

కెల్లక”అనినట్లు మంచివారు గాని, చెడ్డవారు గాని, భగవంతుని శక్తిచేతనే ప్రవర్తించుచున్నారు. ఆశక్తిలేని యెడల యెవరికైనను చేతులుగాని కాళ్ళుగాని ఆడవు. దుర్మార్గులకును భగవంతుడే బలము.

బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకు
బలమెవ్వడు ప్రాణులకును
బలమెవ్వండట్టి విభుడు బలమగు రేంద్రా.

భగవంతుడు తలచుకొనిన యెడల మనుష్యులలో దుర్మార్గము కాని దుర్మార్గులుకాని లేకుండునట్లు చేసియుండవచ్చును. అయితే ఆయన కిష్టమైనపద్ధతి అదికాదు. మంచి చెడ్డలకు పోరాటముండుటయే ఆయనకు ప్రీతి. అట్టి పోరాటవలననే రవ్వలకు సాన పట్టినాట్లుగా సత్పురుషుల సద్గుణములు పెంపొంది ప్రజ్వరిల్లుచుండును. దుర్మార్గులకు బలమిచ్చుటయేగాక, త్రాసులో రెండువైపులను సమానభారముండినయెడల చలనముండదని, దుర్మార్గులకు శక్తిఅధికముగ నిచ్చి యున్నాడు. సద్గుణముల శక్తి హెచ్చినకొలది దుర్గుణముల శక్తియు హెచ్చుచుండును. దుర్గుణముల శక్తి హెచ్చిన కొలదిని దానికి పోటీగా సద్గుణముల శక్తి హెచ్చుచుండును. రాములువారంత సద్గుణుడున్నప్పుడు రావణుడంత దుర్మార్గు

డున్నప్పుడు ఆసమీపముననే ఆయనకు ప్రతిగా బలవంతుడును సద్గుణుడునైన శ్రీరాములవా రవతరించుటయు, రామ రావణ యుద్ధము జరుగుటయు సహజము, సృష్టినిర్మాణ మట్లున్నది. అట్టిపోరే సదా జరుగుచున్నది. దుర్మార్గులవల్ల బాధ కలిగి నప్పుడు "వారు చెడిపోవుదురు. వారి అన్యాయమువల్ల వారే నాశనమగుదురు"అని విసువుజెంది అనుచుందురు. అయితే వారుచెడిపోరు నాశనముకారు. హాయిగానుందురు. అందఱకు వచ్చినట్లు వారికి కష్టములు రావచ్చునుకాని ప్రత్యేకముగ వారి దుష్కృత్యములవల్లనే వచ్చెననుటకు వీలులేదు.

ధర్మసుతుడొడ్డె శకుని క
ధర్మస్థితి నోటువడియె దైవము చెయిదిన్
నిర్మితమైన శుభాశుభ
కర్మఫలంబెట్లుదేహి కడవగనేర్చున్.

ప్రతిజీవికిని తన పూర్వచరిత్రనుబట్టి, పూర్వఅనుభవ మునుబట్టి, పూర్వకర్మనుబట్టి ప్రస్తుతకాలమున నెట్లెట్లు జరు గుట శ్రేయస్కరమో అట్లే జరుగునట్లు భగవంతుడేర్పరచును. మనకు సుఖముకలిగినను అంతయు మన తెలివితేటలవల్లనే కలిగెనని తలచకూడదు. మనకు కష్టముకలిగినను మొహటవాని వల్లనే కలిగెనని యెంచకూడదు. ప్రహ్లాదచంద్రహాసలచరి త్రలవలె లోకములో నెన్నియో జరుగుచుండును. ఇతరులను

కష్టపెట్టవలెనను ప్రయత్నముల్లెప్పుడును ఫలించుచుండవు మంచిపనులుగాని, చెడు కార్యములుగాని, చేయ యత్నించుట వల్లనే జనులు పుణ్యము, పాపము మూట కట్టుకొందురు కాని వారిప్రయత్నములు కొనసాగుట భగవంతుని యిచ్ఛ. ప్రయత్నించిన ఫలమువారిది, కార్యము జరిగిన ఫలము భగవంతునిది. అట్టి ఫలములను సృష్టినిజరుపుటకు వినియోగించుకొనును.

దొరకొని పుణ్యముపాపము
నరుడర్థిఁ జేయుచుండ నడుమనొకంటన్
వెరవెడలి తప్పినను తత్
పరిణతిఫల మొందునంద్రు ధర్మవిధిజ్ఞుల్.

కష్టసుఖములు మనుష్యుల ప్రయత్నమువల్ల రావు. విపత్తులు కలిగినప్పుడు విస్మయపడక కష్టములు వచ్చినప్పుడు కృంగిపోక, సుఖములు వచ్చినప్పుడు పిట్టవీగక, ఓర్పుసమభావము మొదలైన సుగుణములతో వాటినెదుర్కొనుటయే మన చేతనగును. కాని మనకట్టి పరిస్థితులు రావలెనో ఆ విషయముమాత్రము దైవవశమేకాని మనుష్యుల వశముకాదు. మనకు కష్టసుఖములు కొంతవరకు మన ప్రవర్తననుబట్టిరావచ్చును గాని, యితరుల ప్రయత్నమునుబట్టి లేశమాత్రమును రావు. మనకితరులచే హానికలిగినప్పుడు వారేమో మనకు చేసినారని భ్రమపడి వారిపైకక్ష వహించకూడదు. దైవాధీనము

వల్ల నట్లుజరిగెనని గ్రహించవలెను. మనకు బలము, తెలివి, పదిలము మొదలైన సద్గుణములు కొఱతపడుటవల్ల నట్లు జరిగెనుగద అని చింతించవలెను. పుష్కరునిచే సకలకష్టములనుబడిన నలుడేమనెను ?

కలిసంప్రాప్తుడనై కడు
బలమఱి నీచేతఁదొల్లి బలవద్ద్యూతా
కులచిత్తుడయితి నదినీ
బలమని గర్వింపజనునె బలవంతుడవై.

ఇతరుల దుష్ప్రవర్తనచే మనకు కష్టములు కలిగినప్పుడు భగవంతుడే కలుగజేయు చున్నాడని తలచవలెను. అయితే దుర్మార్గులువచ్చి ఒకచెంపమీద కొట్టినప్పుడు యూరకుండి రెండవ చెంపమీదకూడ కొట్టించుకొనుమని మేము బోధించుట లేదు. దుర్మార్గుల నన్నివిధములను సదా నివారించుచుండుట మనకు ధర్మమేకాని మనము వారివిషయములో చేయుపనులను నిష్కామకర్మలుగ జేయవలెను. వారిపై ద్వేషమునకు గాని, రోషమునకు గాని, లేశమైనను మనమనస్సులో తావిచ్చిన యెడల వారు మనకు జేసినహానిగాక మనకు మనమే మఱింతహాని జేసికొందుము.

అధర్మము జరుగుచుండగా మనసామ్మేమి పోయినదని యూరకుండక దాని నణుగద్రొక్కుటకును ధర్మమును నిలువ

బెట్టుటకును మనమేల ప్రయత్నించవలెనో రెండు కారణములను జూచియున్నాము. (1) అధర్మము నిప్పువంటిది. దానిని చేయువారికే గాక అందఱకును మనకును హాని కలిగించ వచ్చును. (2) భూతదయ మోక్షమార్గమున రెండవమెట్టు. భూతదయవల్ల నితరుల కష్టసుఖములు మనవిగా తోచును. అన్యాయమువల్ల నితరులు కష్టబడుచుండగా మనముచూచి యూరకుండజాలము. ఆ రెండుకారణములు గాక మనుష్యుల మధ్య నిరంతరముగ మంచిచెడ్డల పోరు జరుగుచుండుటయే మఱొక కారణము. ప్రతిమనిషియు ఆ పోరుమధ్యనుండుట వల్ల, దానితో తనకు నిమిత్తములేదనియు అది తనకక్కర లేదనియు పారిపోదమన్నను వీలులేదు. శత్రుసైన్యము నందలి వారు మనకెక్కడ కనబడినను మనము పోరాడకతప్పదు. పోరవసరములేదని మనము పారిపోయినను వెంబడించి చంపు దురు. దాగినను వెదకి బైటకుతీసి చంపుదురు. సంగ్రామము మధ్య నున్నప్పుడు మన శక్తికొలది పోరాడుట మనకు విధా యకము, గౌరవము, తప్పదు. అందువల్లనే యోగ్యులు దుర్మార్గమును యెచటచూచినను వెంటనే నిరోధించుచు ప్రజాక్షేమమునకు తోడుపడు చుండవలెను.

దారి చీలికవెనుక ప్రారంభములో కొంతదూరము వరకు ఒకదారివెంట పోవువారికి రెండవదారికూడ కనబడు చుండును. అయితే పోను పోను రెండవదారి కనబడదు. అట్లే

ష్ప్రవర్తన ముదిరినకొలది దుర్మార్గులకు మంచి మార్గము తోచనే తోచదు. ఒకరు చెప్పినను తెలిసికొనజాలరు. శ్రీకృష్ణుడు రాయబారిగా పోయినను కౌరవులువినిరా ? మహాఋషులు మంచిమాటలు చెప్పినను దుర్యోధను డేమనెను ?

మునులార, నన్నువిధి యే
మనిమును పుట్టించెనట్టులయ్యెదుగాకీ
వినజవిలేని పలుకులకు
పనిగలదేయుడుగుడింక బహుభాషణముల్.

ఇదిమంచి యిదిచెడ్డ అని తెలుసుకొనుట కష్టమట్లుండగా, అనేకమందికి తెలుసుకొనవలెనను అభిలాషయే లేక ఎల్లప్పుడు చెడ్డపనులనే చేయుచుందురు. ధర్మమార్గ మనేక విషయములలో సులభముగ తెలియునుగాని అన్ని విషయములలోను అట్లు సులభముగ తెలియదు. సత్పురుషులయందే కొన్ని విషయములలో ధర్మమార్గమేది యని తీవ్రమైన అభిప్రాయభేదములు కలుగవచ్చును. ఇది ధర్మమార్గమని తెలియక పోవుట, ధర్మమార్గమిదియని తెలిసియు దాని నవలంబించుటకు మనస్థైర్యము లేకపోవుట, కొందఱు ధర్మాధర్మముల తారతమ్యమునే లక్ష్యపెట్టక సదా దుష్ప్రవర్తనులై యుండుట, యీ మూడు కారణములవల్లను సృష్టియందు అధర్మము వర్తిల్లుచుండును. దానిని నిర్మూలించుట దుర్లభము. బ్రహ్మదేవుడువచ్చి బోధచేసినను అందఱు మంచివారగుదు

రనుఆశ లేదు. మనము సృష్టినిర్మాణమిట్లుండగా దుర్మార్గముతో పోరాడక దానివల్ల కష్టములుపడుచు, ఆ కష్టములను చూచుటవల్లనే దుర్మార్గుల మనస్సులు మారిపోవునని యాశించుట కేవలమొక పిచ్చిభ్రమ. దుర్మార్గుల కితరుల కష్టసుఖములు చెప్పగా సగముమందికి గాఢమైన నిద్రవచ్చును. మేలుకొని యుండువారు పకపక నవ్వుచుందురు.

యుద్ధము మధ్యనుండువారు నిద్రమత్తుగ నుండిన యెడల వారిగతియేమి కావలెను? యుద్ధరంగమున నేనిమిష మేవైపునుండి దెబ్బతగులునోఅని జాగ్రత్తగా నుండవలెను. అట్లే మెలుకువగ నుండుట మనకు ముఖ్యధర్మము. మనమజాగ్రత్తగ నుండుటవల్ల నితరులను దుర్మార్గులుగ జేయుచున్నాము. దుర్మార్గమున కవకాశమివ్వకూడదు. అట్లవకాశమిచ్చువారును, దుర్మార్గకార్యములను జేయువారును పాపఫలమును పంచుకొనవలసి యుండును. ధైర్యము, బలము, సమర్థత, మెలకువ యుద్ధములోవలెనే ప్రపంచమునందు మనలుటలో ముఖ్యముగ నుండవలసిన గుణములు. యుద్ధరంగమున తనప్రాణమునకు లెక్కచేయక పోరాడవలెనుగాని యుద్ధమధ్యమున నిలిచి నేను చాలమంచివాడనని యూరకుండిన ప్రయోజనమేమి? అట్లే ప్రపంచమందు మన అనుదిన ప్రవర్తనలోకూడ ధర్మమును నిలువబెట్టుటకు ప్రాణక్షతిలేక పాటుబడవలెను. ఒకగింజను దాచిపెట్టుకొనిన యెడల నెందుకుపని

రాకపోవును. దానిని వినియోగించవలసినట్లు మన్నులోపెట్టిన యెడల ఒకటికివెయ్యిగింజలుగా మనకిచ్చును. అట్లే, ప్రాణము దాచిపెట్టుకొనుటకుగాదు. ధర్మార్థము వినియోగించుటకే మనకివ్వబడినది. ప్రాణమరుదైనదికాదు. ప్రతిగడ్డిపరకకును యున్నదే. సృష్టిలో మహాప్రవాహముగ పారుచున్నది. కృష్ణా గోదావరి వరదలలో నదియొడ్డున నొకడు నిలిచి ఒక్కొక్క నీటి బొట్టును పైనుండి తనముందుకు వచ్చునప్పుడు "ఆహాహా" అని సంతోషించుచు, ఒక్కొక్క నీటిబొట్టును తనముందు నుండి క్రిందుకుపోవు నప్పుడు "అయ్యోఅయ్యో" అని యేడ్చు చుండుట యెట్లుండును? ఆనీటిబొట్లు యెన్నశక్యముగాక యెంత విస్తారములుగ నున్నవో, కంటిముందుండియుండనట్లెంత వేగ ముగ పోవుచున్నవో, ప్రాణములును అంత అసంఖ్యములు, అతిక్షణికములు. నిరుపమమై, శాశ్వతమగు ధర్మము మీదను, ధర్మమాచరించుట మీదను పూర్తిగా మన గురియుండవలెను. గాని మన ప్రాణముమీద యుండకూడదు. "ధర్మమాచరింప దగు, మృత్యుచేతులబట్టి యీడ్వబడిన వానివోలె" ఇతరుల ప్రాణములను మాత్రమితరులసొమ్ముల వలెనే చూచుచుండ వలెను.

దేవుని శక్తివల్లనే ప్రతిపనియు జేయగలుగుచున్నాము కాలువ సగముమట్టితో పూడియున్నను పైననీరు పారుచుం

డును గాని మట్టినంతయు తీసివేసిన యెడల నీరుమఱింత బాగా పారును. దీపము గాలికొట్టుచున్నను వెలుగుచునే యుండ వచ్చునుగాని గాలికొట్టనిచోట చలనములేక మండునట్లుగా వెలుగదు. మన యింద్రియములు, మనస్సు విషయవస్తువు లగుటచే విషయవస్తువులే వాని నాకర్షించును; యిటుఅటు కొట్టుకొనునట్లు చేయును. అయితే మన గొప్ప మన సుఖము, మనక్షేమము, మనసంతోషము అను అహంభావము పోయిన యెడల విషయవస్తువులు మనల నాకర్షింపజాలవు. మనస్సుచల నములేక మండుచుండు దీపమువలె వెలుగుచుండును. అహంభా వమును తీసివేసినవెనుక మట్టితీసినకాలువలోవలె దేవునిశక్తి మఱింత హెచ్చుగా మనద్వారా పారును.

ఇత్తము చిత్తము హరికిని
జొత్తము నిర్వాణపథము శుభమగు మనకున్.

బిచ్చగాని కిచ్చునట్లుకాదు: రాజుగారి కిచ్చునట్లు, దాని వల్ల పదింతలు ఫలము కలుగునని తెలిసి మన చిత్తమును దేవున కిచ్చివేయవలెను. ఇది చాల బాగుండును. కాని ఒక చిక్కున్నది. ఇచ్చివేయుటకు మన మనస్సులు మన స్వాధీన ములో లేవు. మన మనస్సులు మనలనే యెవరికైన నిచ్చివేయు స్థితిలో నున్నవి. జ్ఞానమువల్ల విషయవస్తువులకంటె రుచికర మగునవి యున్నవని తెలిసి, క్రమక్రమముగా మనస్సును

స్వాధీనపరచుకొన వలెను. అన్ని విషయములలోను మన యిష్టము మన కోరికలు అనుచు వేఱుగా లేక, సృష్టిధర్మము లెట్లున్నవి, ధర్మమార్గమేది, అని విచారించుచు భగవదిచ్ఛయే మన యిచ్ఛగా ప్రవర్తించినయెడల మన కనంతమగు శక్తి, బలము, క్షేమము కలుగును. మంచిచెడ్డల యుద్ధములో మన లను కాపాడుకొనుటకును ధర్మమును కాపాడుటకును అవ కాశముండును. ఇట్లు ప్రవర్తించుటయే భక్తి.

చాలదు భూ దేవత్వము
సాలదు దేవత్వ మధిక శాంతత్వంబుఁ
జాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార భక్తిసాలినభంగిన్.

మనము ప్రతిసారి పని జేసినప్పుడును భగవంతుని శక్తి వల్లనే చేయగలుగు చున్నాము. మనముచేయు ఒక్కొకపని వల్లను మనము ఆశక్తివల్ల భగవంతున కొకఅడుగు దగ్గరగా గాని, ఒకఅడుగు దూరముగా గాని పోదుము. జ్ఞానముతోను, భక్తితోను చేసినపని భగవంతునివైపు తీసుకొని పోవును. అజ్ఞానముతోను, అహంభావముతోను, చేసినపని భగవంతు నకు దూరమగునట్లు చేయును. జ్ఞాన, భక్తియుతమగు పనుల వల్లనే మోక్షముకలుగును. పూజలు, భజనలు, ధ్యానము, ప్రార్థన మొదలైనవి సరియైన పనులను, సరియైన బుద్ధితో

చేయునట్లు పురికొల్పుటకే యేర్పడియున్నవి. కొందఱు ఉదయ మేడుగంటలకును పూజచేయుచుందురు, ఎనిమిది గంటలకును పూజచేయుచునేయుందురు, తొమ్మిదిగంటలకును వారి పూజపూర్తికాదు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు లేచి సూర్యుడుదయించువేళకు పూజలు ప్రార్థనలు పూర్తి చేసికొని, సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు సత్కార్యములకు సిద్ధపడి యుండవలెను. ఒక్కొకపని చేయుటవల్లను భగవంతున కొక్కొకఅడుగు సమీపించు అవకాశమున్నదనియు, గడచిపోయిన కాలము తిరిగి రాదనియు, మోక్షమార్గము దూరయాత్ర అనియు, అనేక సత్కార్యముల జేసి అనేక అడుగులు వేయవలెననియు, యోచించవలెను. ఈజన్మము పోయినను యింకొక జన్మమువచ్చును కద అని అనుకొనకూడదు. సృష్టి అనంతమైనది కోట్లకు కోట్లజనులున్నను ఒకరివలె నొకరుండరుకద. సృష్టిలో అనేక లోకములు అనేక పరిస్థితులు యున్నవి. ఇదేమాదిరి జన్మము, సందర్భములు తిరిగి మనకురావు. ఈ జన్మములో ప్రతినిముసమును వెండి బంగారుకంటె విలువగలదిగా చూచుకొనవలెను.

ఒక రోడ్డును వేయుటకు కంకర, యెఱ్ఱమన్ను, ఇసుక కావలెను. రోడ్డులను వేయుటను గురించి చెప్పు పుస్తకములలో కంకరను గురించి ఒక ప్రకరణము, ఎఱ్ఱమన్నును గురించి ఒక ప్రకరణము,ఇసుకను గురించి ఒకప్రకరణము యుండవచ్చును.

దానిని బట్టి వాటిలో నొకదానితో నొకటి సంబంధము లేదని తలచకూడదు. ఇట్లే మన గ్రంథములలో జ్ఞాన, భక్తి, కర్మ మార్గములను గురించి వేఱువేఱు ప్రకరణము లుండుటనుబట్టి ఒకదానితో నొకటి సంబంధము లేదని తలచకూడదు. మనకు శరీరము, మనస్సు, ఆత్మ, మూడున్నవి. శరీరమునకు సంబంధించినది కర్మ, మనస్సునకు సంబంధించినది భక్తి, ఆత్మకు సంబంధించినది బ్రహ్మజ్ఞానము. శరీరము, మనస్సు, ఆత్మ, వీనికి పరస్పరసంబంధము లేదనుట కెట్లు వీలులేదో, కర్మ, భక్తి, జ్ఞానములకు సంబంధము లేదనుకొనగూడదు. మోక్షమార్గమున కీమూడును ముఖ్యమే. ఒకడు తన ప్రయత్నమేమియు లేకయే సహజముగ బలశాలిగ నుండవచ్చును. అయితే బలహీనులును యూరక కూర్చుండక క్రమమైన చికిత్సలు, ఆహారములు, కసరతులు, అభ్యాసముల వల్ల సింహాబలమును పొందవచ్చును. ఒకడు సహజముగనే చాల తెలివిగలవాడై యుండవచ్చును. అయితే మొద్దులైనను క్రమముగా విద్య నభ్యసించి అద్భుతమైన తెలివితేటలను పొందవచ్చును. ఇట్లే భగవంతుని కృపవల్ల యెట్టివారికైనను అప్రయత్నముగనే బ్రహ్మజ్ఞానము కలుగవచ్చును. అయితే అట్లు కలుగనివారు యూరకుండకూడదు. అందఱకును జ్ఞానభక్తియుతమగు కర్మమార్గము మోక్షమార్గముగ నేర్పడియున్నది. శరీరము విషయములోగాని, మనస్సువిషయములోగాని, ఆత్మవిషయ

ములోగాని కొంతవరకు మనకు సహజముగ నివ్వబడును. మిగిలినది పూర్తిచేసికొని పరిపూర్ణతనుపొంద ప్రయత్నించవలెను.

మనముచేయు ప్రతిపనియు మంచిచెడ్డలపోరులో మంచికిగాని చెడ్డకుగాని తోడ్పడును. జ్ఞానముతో, భక్తితో చేసిన పని మనకు, ఇతరులకు మేలుచేయును. మోక్షమార్గమున ఒకఅడుగు ముందునకుబంపును. అజ్ఞానముతో, అహంభావముతో చేయుపని మనకు ఇతరులకు హానిచేయును. మోక్షమార్గమున ఒకఅడుగు వెనుకకుతోయును. చిన్నపనికాని, పెద్దపనికాని, గౌరవవృత్తికాని, హీనవృత్తికాని, అహంభావముతో గాక భక్తితో చేయుటచే ధర్మవ్యాధుని కథలోవలెభగవంతుని సమీపించునట్లు చేయగలదు. శ్రీరామకృష్ణ పరమహంసయు గాంధిమహాత్ముడును పాకీపనిచేసి దొడ్లనుకూడ శుభ్రముచేసి యున్నారు. ఆలుస్వయముగా చేసిచూపుటకంటె నెవరైనను యెక్కువగబోధచేయగలరా? పనులుచేసిపెన్షను లుపుచ్చుకొన్న వారుపనిలేక తోచుటలేదందురు. పాఠశాలలలో విద్యనభ్యసించినవారు వేలకువేలమంది పనులుదొరుకుటలేదని చింతించెదరు. ధనవంతులు "మేము పని చేయనక్కర లేదు హాయిగానుందు"మనుకొనెదరు. తమ గొప్ప, తమ సుఖము తమ మంచి చూచి పనిచేయనక్కరలేదనుకొనవచ్చును. చేయుటకు పనులు కనబడకపోవచ్చును. కాని లోకుల కష్టసుఖముల జూచినయెడల

చేయవలసినపని అనంతముగ నున్నది. సేవచేసి విముక్తిపొందు మని దరిద్రనారాయణుడు సదా కనిపెట్టుకొనియే యున్నాడు పనిచేయుట గౌరవ భంగమనియు తిని కూర్చుండుట గౌరవ మనియు మన దేశమునందనుకొనుట మానినగాని మన దేశ దారిద్ర్యము తీరదు. పని, అన్నముపెట్టు అన్నపూర్ణదేవి. పని భగవంతుని సమీపించు అవకాశమిచ్చునది. ప్రపంచములో పరిపూర్ణులైన వారుగాక, అందఱును తాము పనిచేయవలెను, తమశక్తికొలదిని యితరులకు పనులు చేసికొన నవకాశములు కల్పించవలెను. ఉన్నవానికంటె తిన్నవాడెక్కువ, తిన్నవాని కంటె యితరులకు పెట్టువాడెక్కువ. వెయ్యి మందికి ఉచి తముగపెట్టువానికంటె పదిమందికి పనులు చేసికొనుటకవకాశ ములను జీవనోపాధులను కలిగించినవాడెక్కువ. ఏపని జేసినను ఆపనిని భక్తిశ్రద్ధలతో జేయుటయే ముఖ్యమని యెంచవలెను. మన ప్రయత్నము ఫలించుట, ఫలించినయెడల ఫలము మనకు దక్కుట అంత ముఖ్యముకాదు. దొంగలు కాని, రాజులుకాని మనము ప్రయాసపడి సంపాదించిన దానిని అపహరించినను అట్టి దుష్కృత్యమునకు చింతించి శక్తి కొలది అడ్డగించవలెను కాని అంతయు పోయినదని చింతించ కూడదు. ముఖ్యమైన ఫలము పనినిచేయుటవల్లనే పొంది యుందుము. గింజలు రాల్చుకొనినవెనుక గడ్డిని కోసుకొని పోయినారని తలచవలెను. సరియైన బుద్ధితో—అనగా స్వార్థ

పరత్వమును విడిచి, మంచిచెడ్డలను విచారించి, సృష్టిధర్మముల కనుగుణ్యముగ, భగవదర్పితముగ - నేపనినైనను యెప్పుడయితే చేయుచున్నామో అప్పుడే భగవంతుని సమీపమున కొక అడుగు వేయుచున్నాము. మనకు ముఖ్యముగ కావలసినదదియే.

మంచిచెడ్డలపోరు అనంతముగా జరుగు చుండునని గ్రహించనియెడల ధర్మమార్గమును గురించి అనేక సంగతులు సులభముగ తెలియును. భగవంతు డాయుధములను చేతబట్టక పాండవుల ప్రక్కన నిలిచి భారతయుద్ధమును జరిపినట్లు, యీ పోరునందు మంచివైపున నుండునుగాని తన దివ్యాయుధము లను చేతబట్టక పోరును చూచుచుండును. ఒక పక్షమునకు బల మెక్కువకాగా దానికి పోటీగా రెండవపక్షపు బలమును కూడ హెచ్చించుచుండును. సృష్టిలో నేదియు, యెవరును దుర్మార్గముతో ప్రతిగా యుండలేనంత హెచ్చయినప్పుడు మాత్రము తానే స్వయముగా సృష్టిలోనికి అవతరించును. ఈ పోరునందు మనము ధర్మము పక్షముననుండి అధర్మమును అడ్డగించు చుండుటయే మోక్షమార్గము. ప్రపంచము చెడ్డ దనియు దానిని విడిచిపెట్ట వలెననియు కొందఱనుచున్నారు. చెడ్డది కాబట్టియే దానిని విడిచిపెట్టకూడదు. దానియందుండి మంచికొఱకు పాటుబడు చుండవలెను. ఇరుగు పొరుగువారు కాని, లోకుల సొత్తులుగాని లేనిచోట దొంగబుద్ధి లేకుండుట గొప్ప విశేషముకాదు. దుర్మార్గమున కవకాశములేనిచోట

సన్మార్గమున కవకాశమేమున్నది ? దుర్మార్గము లేనిచోట సన్మార్గమును లేదు. ఈ అద్భుతమైన సృష్టిని, మానవజాతిని, సంసారమును తనయొద్దకు జేర సాధనములుగను, అసాధ్యమగు మోక్షపదవిని సాధించుటకు సన్మార్గమను మెట్లుమెట్లుగానుండు మార్గమును, భగవంతుడు నిర్మించియున్నాడు. వీటిని నిరాకరించుట కర్తవ్యముకాదు. పెద్దలు వ్యయప్రయాసలుపడి పాఠశాలనుబెట్టి బాలుర నందుచేర్చినప్పుడు "పాడుబడి ! దీనివల్ల చాలాకష్టముగా నున్నది. ఊరుబైటకుపోయి చింతచెట్లక్రింద కోతికొమ్మచ్చి ఆడుకొనినను, చల్లగాలికి నిద్రపోయినను చాల బాగుండు"నని అట్లే ప్రవర్తించు బాలురను గూర్చి మన మేమనుకొనవచ్చును ? పాఠములు నేర్చుకొనిన వెనుక నెక్కడకు పోయినను, ఏ ఆటలాడినను ఫరవాలేదు. ఎల్లకాలము సంసారమునందే యుండవలెననికాదు. అయితే ప్రపంచము, సంసారము, మంచి, చెడ్డ యివి తనయొద్దకు చేర్చుటకు మోక్షమార్గమున భగవంతు డేర్పరచిన ముఖ్యమైన మెట్లు.

ఈ మంచిచెడ్డల పోరులో మంచికి తోడుపడువాడే మంచివాడు. అన్యాయమునకు అడ్డపడక, న్యాయమునకు తోడుపడక, యూరక మంచి ఆలోచనలతో మంచి బుద్ధులతో నొకమూల కూర్చుండువారు మంచివారా ? మంచి బుద్ధులు, ఆలోచనలు భూమిక్రిందనుండు వేళ్ళవంటివి. చెట్టు

పైకి యెదిగి పూలుపూసి పండ్లు కాసినప్పుడే చెట్టున్నదని సంతోషించెదము. మాచిపనులే మంచి ఆలోచనలనుండి పైకి రావలసిన చెట్లు. చేదుగానుండు చక్కెర లేదు. చీకటిగానుండు వెలుతురు లేదు. మూల కూర్చునియుండు మంచితనము లేదు. మంచిబుద్ధి విశేషమేగాని ఒక గొప్ప విశేషము కాదు. దుర్మార్గులమధ్య మంచితనమును నిలువబెట్టుకొని, ఇతరులుకూడ మంచిమార్గమున ప్రవర్తించునట్లు చేయుటయే గొప్ప విశేషము. ధర్మమునునిలువబెట్టుటయే మంచితనము. దృష్టాంతము. నిజముచెప్పుట మాత్రము గొప్ప విశేషముకాదు. పదిమంది దుర్మార్గులమధ్య తిరుగుచు, వారి అసత్యములవల్ల మోసపోయి అడుగంటక కాపాడుకొనుచు తాను సత్యమును విడువక వర్తిలగలుగుటయే గొప్పవిశేషము. ఇతరులు చెడ్డపనికి పూనుకొనినప్పుడు దాని నాపగలశక్తి యుండవలెను. ఇతరులు మంచిపనికి అడ్డము వచ్చినప్పుడు దానిని జరుపగలశక్తి యుండవలెను. తన విషయములోగాని తన యెదుటగాని అధర్మము జరిగినప్పు డడ్డుపడలేక "అయ్యో, అయ్యో" అనిమాత్రమనుకొనజాలినవాడు మంచివాడుకాడు. కానమంచిచెడ్డల పోరులో నెగ్గునట్లుగా విద్యవల్ల, అభ్యాసమువల్ల జ్ఞానము, బలము, శక్తిని పొందవలెను. మంచిచెడ్డలపోరులో ప్రవేశించి, ప్రాణముండువరకు సదా సత్కార్యములను జేయుచునే యుండుట ముఖ్యమైన ధర్మమని గ్రహించవలెను. అయితే అట్లుచేయుట

మన ధర్మమని చేయవలెను గాని దానివల్ల మనము లోకము నుద్ధరించు చున్నామను భ్రమ పడకూడదు. లోకముల నుద్ధరించుటకు భగవంతుడే యున్నాడు. కోట్లకుకోట్ల దేవత లాయన ఆజ్ఞల నెదురుచూచుచు కనిపెట్టుకొని యున్నారు. దుర్మార్గులు దుష్కార్యములపై ఆసక్తికలిగి యెట్లుబాధ పడెదరో సత్పురుషులు సత్కార్యములపై ఆసక్తి కలిగినట్లే బాధపడుదురు. మంచిపనులనుచేయుట చాలదు. నిష్కామ కర్మలుగ చేయవలెను. ప్రయత్నము మన ధర్మమనియు ఫలము మనదికాదనియు గ్రహించినప్పుడే సత్పురుషులకు కష్టసుఖములనుండి విముక్తికలిగి వారు తలపెట్టినట్లు జరిగి నను జరుగకపోయినను మనస్సు ఒకేవిధముగ నెల్లప్పుడును శాంతముగ, సంతోషముగ నుండును.

ఇట్ ఇజ్ ఈజి ఇనఫ్ టు బి ప్లెజెంట్
వ్హెన్ లైఫ్ ఫ్లోస్ బై లైక్ ఎ సాంగ్
బట్ ది మ్యాన్ వర్త్ వ్హైల్
ఇజ్ ది వన్ వ్హూ విల్ స్మైల్
వ్హెన్ ఎవిరిథింగ్ గోస్ డెడ్ రాంగ్

మంచి పనులను చేయుటకు మన ధర్మమని చేయ వలెనుగాని, దేవునిమీద దయదలచికాదు, లోకులమీద దయదలచికాదు. మంచిపని ముందుకష్టమని తోచినను

తుదకు మనకు మంచిది, లోకులకు మంచిది, ఇహమునకూ పరమునకు పనికివచ్చును. చెడ్డపనులు చేయునప్పుడు సంతోష కరముగ నున్నను, పిమ్మట మనకు కష్టము, లోకులకు కష్టము ఇహమునకు పరమునకు కూడ పాడుచేయును. మంచిపనులను జేయుటకు శరీరము మనకొక పనిముట్టుగా నివ్వ బడినది. "మనము" అనగా మనశరీరముకాదు. ధర్మమును సాధించుటకు మనకు శరీర మివ్వబడినది. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం". దేశయాత్రకుపయోగపడునని గుఱ్ఱమునుగాని గిత్తనుగాని పచ్చిగడ్డి, దానామొదలైనవి, దానికి రుచికర మగు వస్తువులను పెట్టుచు జాగ్రత్తగా పెంచునట్లు మోక్ష యాత్ర కుపయోగపడు వాహనమని గ్రహించి శరీరమును క్రమముగా చూడవలెను. ఒక గుఱ్ఱమునుగాని, ఎద్దునుగాని క్రూరముగ చూచుటెట్లు పాపమో శరీరమునకు హానికలుగు నట్లు ప్రవర్తించుటయు పాపమే. మనము వేఱు మనశరీరము వేఱు కాన, ఇతరుల విషయములో అసత్యము, చోరత్వము మొదలగువాటిచే దుష్ప్రవర్తనవల్ల నెట్లు పాపము చేసు కొనవచ్చునో, మనశరీరము విషయములో మన ప్రవర్తనవల్ల మనము పాపము చేసుకొనవచ్చును. సాధారణముగ నీ సంగతి నందఱు గమనించరు. అనారోగ్యపద్ధతుల నవలంబించి జబ్బుచేసి కష్టము వచ్చినవెనుక "నేనెవరికి నేమియు చెడ్డపని చేయలేదే" అని తలచుచుందురు. మనదేశములో బిడ్డల

చావులు, బాలింతలచావులు, అన్నివిధముల అకాలమృత్యువులు అపరిమితముగ నున్నవి. దేశము పేదస్థితియందుండుట కారణమందురు. కాదు. పేదవారి యిండ్లలోను ధనవంతుల యిండ్లలోనుకూడ నిట్లే జరుగుచున్నవి. ముఖ్యకారణ మజ్ఞానము. శరీరమునకు సంబంధించిన సృష్టిధర్మములను తెలుపు ఆయుర్వేదశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము మొదలైనశాస్త్రములజ్ఞానము ప్రజలలో వ్యాపింపజేయవలెను. ఇతరుల విషయములోవలెనే మన శరీరము విషయములోకూడ సృష్టిధర్మములకు వ్యతిరేకముగ ప్రవర్తించుట పాపమని అందఱకు తెలియవలెను. మనస్సు, పంచేంద్రియములు అన్నివైపుల కీడ్చుకొని పోవజూచినను పోనివ్వకూడదు. ఐహికవిషయములపై రుచికంటే ధర్మమార్గముపై రుచి అధికమగుటవల్లనే అట్లు చేయుట సాధ్యమగును. రామనామము తియ్యగానున్నదని పాటలు పాడినంతమాత్రమున ప్రయోజనములేదు. బూరెలు బొబ్బట్లు మారువచ్చినప్పు డంతకంటె తియ్యనిదున్నదని జ్ఞాపకము తెచ్చుకొని వద్దనవలెను. ఇట్లే ధర్మవిరుద్ధముగానే శరీరసుఖములపై మనస్సు పోవుచున్నను అంతకంటె రుచికరములగు ధర్మవిషయములపై మనస్సునుత్రిప్పి విషయసుఖముల వాతబడకుండ తప్పించుకొనవలెను.

హౌ స్వీట్ ఆర్ లుక్స్ దట్ లేడీస్ బెండ్
ఆన్ ఫ్రం దేర్ ఫేవర్స్ ఫాల్

బట్ ఆల్ మై హార్ట్ ఇజ్ డ్రాన్ ఎబవ్
మోర్ బౌంటియస్ యాస్పెక్ట్స్ ఆన్ ది బీం
మి మైటియర్ ట్రాన్స్పోర్ట్స్ మూవ్ ఎండ్ త్రిల్.

ధనవంతులకు తిండిపోతుతనము, పేదలకు త్రాగుడు, అందఱకు కాఫీ టీ, పొగాకు(చుట్టలు, సిగరేట్లు, బీడీలు) దురభ్యాసములవల్ల మన దేశమందంతటను ఆయురారోగ్యములు క్షీణించిపోవుచున్నవి. దేశముయొక్క దుస్థితితప్పి తిరిగి ఉన్నత దశకు రావలెనన్న మంచిచెడ్డల జ్ఞానమున్న వారందఱును వీనిని విషమువలె వర్జించి ప్రజలకు మార్గదర్శకులగుట ప్రథమకర్తవ్యము.

మంచి పనిచేసిన వెంటనే మేలుకలిగిన యెడల నందఱు మంచిపనులనే జేయుచుందురు, అట్టి మంచి భగవంతున కక్కరలేదు, సృష్టిలో నట్లేర్పాటు చేయలేదని చెప్పియుంటిమి. చెడ్డపనులను చేసినవెంటనే తప్పక కష్టము కలిగినను అందఱు చెడ్డపనులను చేయుట మానివేయుదురు. అట్టి మంచియు, భగవంతున కక్కరలేదు. వాటివల్ల వచ్చు కష్టసుఖములపై దృష్టిలేక మంచిచెడ్డలపైననే ప్రేమ, రోత కలుగవలెనని భగవంతుని యేర్పాటు. అందువల్లనే, చెడ్డపని చేసినవెంటనే కష్టమురాదు. చెరువు కట్టక్రింద నివసించువాడు తన యింటిమరమ్మతులకు పొలముల మరమ్మతులకు పరవాలే

దని చెరువుకట్టలో మన్నుత్రవ్వకొనవచ్చును. ఇట్లు త్రవ్వగా త్రవ్వగా నెప్పుడో ఒకప్పుడు కట్టతెగును, కొంపమునుగును. సృష్టిధర్మములకు విరుద్ధముగా ప్రవర్తించుటయు నిట్లే. అందు ముఖ్యముగ మన శరీరములకు సంబంధించిన ధర్మముల నతిక్రమించకూడదని యీ విషయమును జ్ఞాపకముంచుకొన వలెను. అనారోగ్యమైన పనులను చేసినప్పుడు జబ్బుచేయక పోవచ్చును. ఆపదవచ్చి మీద పడకపోయినను అవి చేయు హానిచేయక తప్పవు. అనేకుల విషయములో "బాగా శుభ్రముగా నుండెను. కొంచము జబ్బుచేసిపోయెను" అని వినుట లేదా. అధర్మమైన కార్యములు, అనారోగ్యమైన పనులు చేయు హాని అప్పుడప్పుడే కనబడకపోయినను అవి మిక్కిలి అపాయకరములని గ్రహించి విషమువలె వర్జించవలెను. సృష్టికర్తయొక్క అద్భుతమును చూడుడు. తాను కనబడడు. సృష్టిధర్మముల ననుసరించి ప్రవర్తించిరా లేదా అని విచారించుటకు కోర్టులులేవు మేజిస్ట్రీటులులేరు. సృష్టిధర్మముల నతిక్రమించినప్పుడు పట్టుకొనుటకు పోలీసువారులేరు. అయినను కోట్లకు కోట్ల జీవులు ఏ చిన్నపనులు చేసినను మంచికిమంచి చెడ్డకు చెడ్డ అనుభవించక తప్పుకొనకద. ఏదితప్పినను అనుభవము తప్పదు. సృష్టిఅంతయు ఒక గొప్ప యంత్రమువలె నిర్మింపబడినది. పైన చూచువారు విచారించువారు శిక్షించువారు అవసరములేదు. ఒకొక్కకపని నెప్పుడయితే చేయు

చున్నామో దానివల్లనే ఒక్కొక అనుభవము కలుగుచుండ్లు చేసుకొనుచున్నాము. కాన చూచువారున్నను లేకపోయినను అడ్డపడువారున్నను లేకపోయినను ధర్మము తప్పకూడదు.

ఎద్దుకాని గుఱ్ఱముకాని జబ్బుపడినప్పుడు దానిని మార్చుకొన వచ్చును. అయితే జీవయాత్రలో ఆదినుండి తుద వరకు మనకీ శరీరమే వాహానముగ నుండుటతప్పదు. జీవ యాత్రలో మనకుపయోగపడు వాహానమనియు, ధర్మమును సాధించుటకు మనకివ్వబడిన సాధనమనియు గ్రహించి, ఇత రుల విషయములో నీతిమార్గమునుతప్పక సృష్టి ధర్మముల ననుసరించి ప్రవర్తించవలసివట్లే, శరీరము విషయములోకూడ శరీరమునకు సంబంధించిన సృష్టి ధర్మములను తెలుసుకొన వలెను. తెలుసుకొనిన వెనుక వాటిననుసరించి ప్రవర్తించ వలెను. మంచిచెడ్డల జ్ఞానముకలిగిన వెనుక దాని ననుసరించి ప్రవర్తించని యెడల నది గాడిదమోయు బంగారువలెనుండును. దాని కుపయోగములేక పోవుటయేగాక ఎనురు బరువుచేటు.

బై మ్యాక్ లీ మైండ్
నాట్ ఈవెన్ ఇన్ స్లీప్ ఇజ్ విల్ రిసైన్డ్

మనస్సు, పంచేంద్రియములు వేఱు త్రోవలబోవ జూచి నను, మనుష్యుడు సదా ఆత్మనిగ్రహాము నభ్యసించుచు సృష్టి ధర్మముల ననుసరించే ప్రవర్తించ వలెను.

శరీరమునకు సంబంధించిన సృష్టి ధర్మము లన్నిటిలో ముఖ్యమైన దొకటున్నది. అది అనేకులకు తెలియదు. అదే మనగా:-శరీరమునకు పరిశ్రమ ముఖ్యావసరము. బాగా ఆకలి కలుగుటకు, నిద్రపట్టుటకు, తిన్నది అరుగుటకు, ఒడల బట్టుటకు, బలము, ఆయురారోగ్యములు వృద్ధియగుటకు, అన్నిటికిని పరిశ్రమ అత్యవసరము. అది లేనియెడల శరీరమునకు హాని కలుగక తప్పదు. అనేకులు "మే మేమియు కష్టపడి పని చేయుట లేదు. హాయిగా లేమా" అనుకొన వచ్చును. అట్లను కొనదగదు. సృష్టి ధర్మముల ననుసరించి ప్రవర్తించని యెడల తుదకు హానికలుగక తప్పదు. పేదవారివలె మనము పనిచేయ వచ్చునా అని అనుమాన పడకూడదు. పేదవారి వలె ఆహారము తినుటయు నిద్రపోవుటయు అందఱకును ఎట్లవసరమో అట్లేపనిచేయుట అవసరమని గ్రహించవలెను పనిచేయుటవల్ల పరమార్థము పొందవచ్చునని ఆదివరకు చెప్పి యున్నాము. అది మన శరీరముల క్షేమమునకును ముఖ్యావసరమై యున్నది. పని ఇహపరములు రెంటికిని ముఖ్యసాధనము.

అన్ని మంచివస్తువుల వలెనే పనిచేయుట ముందు కష్టముగ తోచిన, పిమ్మట ఫలముకలుగును. కష్టముగతోచి నప్పుడు దానిని తప్పించుకొన వలెనని నాగరికత హెచ్చిన కొలది మనుష్యులు తమ తెలివితేటలను బట్టి పనితగ్గుట

కనేక సాధనములను నిర్మించుకొని యున్నారు. అన్ని శాస్త్రములు, విద్యలు, సంగతులు తెలిసియుండుట మంచిది కాని ఇహపరములకు తోడుపడువానిని మాత్రమభ్యసింప వలెను. పని తగ్గించుకొనుటకు, నడువనవసరము లేకుండునట్లు బండ్లు వాహనములు ఏర్పరచుకొని యున్నారు, చేతులతో పనిచేయు నవసరము లేకుండునట్లు వివిధయంత్రములను నిర్మించుకొని యున్నారు. నీటిని పట్టివాడుకొనుటకు పాత్రలెట్లు ప్రయోగ పడుచున్నవో, యంత్రములట్లే సృష్టియందలి శక్తినిబట్టి వాడుకొనుట కుపయోగ పడుచున్నవి. యంత్రశాస్త్రము నభ్యసించుటవల్ల సృష్టియందలి శక్తిని యెంతకావలెనన్న అంతతీసుకొనివినియోగించు కొనగలము. అవసరము వచ్చినప్పుడు అపారమగు శక్తిని ప్రయోగించ వచ్చును. అయితే అనుదిన చర్యలలో మన చేతులతో పనిచేయుట మనక్షేమమునకే ముఖ్యావసరము. అట్లు చేయుటకు వ్యవధిలేనప్పుడును, అట్లు చేయ వీలులేని పనులనుమాత్రము యంత్రములతో చేయించ వలెను. కాని యంత్రములున్నవి కదాఅని బద్ధకించి అన్ని పనులు వానిచేతనే చేయించకూడదు. యంత్రములు మనము పనిచేయ నవసరము లేకుండచేసిన యెడల తుదకు మనము బ్రతుకుటకూడ అవసరము లేకుండ జేయును.

పశ్చిమదేశములలో నవనాగరికత ప్రబలి అన్నిపనులూ యంత్రములవల్ల చేయించుకొను చున్నారు. అయితే అను

దినము కష్టపడి పనిచేసినగాని శరీరమునకుబలము ఆరోగ్యము కలుగవు, నిలువవు. అందువల్లనే వారిలో కసరతులు, ఆటలు పందెములు అధికమై అన్నిటికంటె ముఖ్యముగ జూడబడు చున్నవి. ముసలివారుకూడ ఒక బంతినో కఱ్ఱనో పెట్టుకొని చిన్నపిల్లలవలె పరుగులెత్తు చుందురు. ఎంతగొప్పవారైనను యేదో ఒకపనిని కల్పించుకొని రోజునకొకసారియైనను శరీరము నకు చమటపోయునట్లు పనిచేయుదురు. సీమరాణీగారికి ప్రధాన మంత్రిగనుండి గొప్ప పేరుపొందిన గ్లాడ్ స్టన్ అను నతడు గొడ్డలితో చెట్లను కొట్టుచుండెను. అట్లుచేయుటకు వీలుబడని రోజున ఒక గంట సేపైనను వేగముగనడచుచు షికారుచేయుచుండెను. అట్లు చేసినగాని ఆరోజు నిద్రించగూడ దని శపథము కట్టుకొనెను ఆంగ్లేయులకు సాధారణముగ వారి జీవనములు గడుపుకొనుట కవసరములేని పనులు, వడ్ర ముపని, కమ్మరపని, మొదలైన వనేకపనులు సంగతులు తెలిసియుండును. వారువానినితమవినోదముకొఱకేఅభ్యసించు చుందురు. నవనాగరికతవల్ల భ్రమపడి అంతయు దొరలవలె నుండవలెననిజూచువారీవిషయములనుకూడ గమనింతురుగాక.

పశ్చిమదేశస్థులు వారి సందర్భములను బట్టి ఆటలు పందెములవల్ల వారికవసరమైన శరీర పరిశ్రమను పొందవ చ్చును. గాని మనదేశ పరిస్థితులనుబట్టి మనముచేయ వలసిన పనులనేకములున్నవి. రోడ్డులను వేయుట, వంతెనలనుకట్టుట,

చెరువులు, కాలువలు, నూతులు, త్రోవప్రోట, పేదవారుండుటకు యిండ్లు కట్టుట, వనములను స్థాపించుట, నీరు మురుగకుండ కాలువలుకట్టుట, మురుగుచుండు చెరువులుగుంటలు పూడ్చుట లేక బాగుచేయుట, యిట్టివి ప్రజాక్షేమమున కవసరమైన పను లనంతముగ నున్నవి. పేదదేశమనియు, డబ్బులేదనియు అవసరమైన పనులు జరుగకున్నవి. పిచ్చిగంతులు, పరుగుల కన్న జీవనములకు కష్టబడ నవసరములేని వారందఱును చేరి అట్టిపనులను చేయువిధమును నేర్చుకొని చేయుచుండిన యెడల వారికిని యితరులకును, ఇహమునకు పరమునకును క్షేమకరముగ నుండును. ఫలమున కెదురుచూడక పనిమీద అక్కఱకలిగి యీ విధముగా కావలెను గాని లేని యెడల మన దేశమునకు ముఖ్యావసరమైన అనేక పనులు మన దేశపు ప్రస్తుతస్థితిలో జరుగనే జరుగవు.

పని చేయుట శరీరారోగ్యమునకు ముఖ్యమని స్త్రీలును గమనించవలెను. స్త్రీలును మనుష్యులే. మానవజాతియం దెవరైనను సృష్టి ధర్మముల నతిక్రమించి నడుచుకొనిన కీడు కలుగుక తప్పదు. నవనాగరికతయందిండ్లలో పనితగ్గుట కనేక సాధనము లేర్పడి యున్నవి. వాని నుపయోగించుకొని బొత్తుగా శరీర పరిశ్రమ లేకుండునట్లు చేసుకొనిన యెడల స్త్రీల ఆరోగ్యము చెడిపోకతప్పదు. ప్రతిగృహము నందును ఉదయము లేచినవెనుక పాచిపని, పాడి చేసుకొనుటనుండి

రాత్రి యిండ్లుకడుగుకొను వరకు అనేక పనులుండును. స్త్రీలు తమ చేతనగునంతవరకు తను ఓపిక, బలములకు తగినట్లు పనులను చేయుచుండుట మంచిది. శక్తికి మించినప్పుడే యంత్రముల సహాయమును పొందవచ్చును. "అతి సర్వత్రవర్జయేత్" అనినట్లు మంచి వస్తువులైనను మితముమీరినప్పుడు చెడ్డవగును. పురుషులైనను, స్త్రీలైనను తమ శక్తికొలది తమ అవసరముననైనను లేక పైనజెప్పినట్లు తమ వినోదమునకైనను లేక ప్రజాక్షేమమునకైనను సదా పాటుబడుచు అట్టి పరిశ్రమాభ్యాసమువల్ల తమ శరీరముల బలము, పటుత్వము దార్ఢ్యము శక్తిని క్రమముగా వృద్ధి జేసుకొనవలెను. స్త్రీలు ధాన్యము దంపుట మొదలైన కష్టమైన పనులనుకూడ తమ యింటి కవసరమైన పనులనన్నిటిని తామే చేయుశక్తిని పొందవలెను. అన్నిపనులను చేసిపెట్టుటకు యంత్రములు, సేవకులు యుండవచ్చును గాని అన్నిపనులను అట్లు చేయించుకొనిన యెడల పనివల్లకలుగు ఇహాపర క్షేమములు మనకు చేకూడవు. ఇంటి పనులు చేయనియెడల పశ్చిమదేశముల స్త్రీలవలె కసరతులు ఆటలు, పందెముల వల్లనైనను రోజునకొకసారి శరీరమునకు బాగా చెమటపట్టునట్లు చేసుకొనవలెను.

మన మంచికొఱకు, ఇతరుల మంచికొఱకు చేయవలసిన పనులు వేలకువేలు కలవు. కాని విద్యలేనిచో ఒక్క కూలిపనితప్ప యేపనియు చేయజాలము. ఈ రోజులలో పాత

శాలలయందు విద్య నభ్యసించిన వారుకూడ నొక పనినైనను చేయజాలకుండుట విచారకరము. మన దేశమునందు పూర్వపు విద్యలన్నియు నశించినవి. అత్యున్నత దశనుగాంచిన భరత వర్షము కూలీల దేశమనియు, భారతీయులు కూలీలజాతి అనియు నిప్పు డితర దేశములలో పేరుపొంది యున్నారు. ఇది అతిశయోక్తి కాదు. ఈ విషమస్థితి పోవలెనన్న నందఱును విద్యలపై నాసక్తికలిగి విద్యలను నేర్చుకొన వలెను. విద్య ఇహపరములు రెంటికిని ముఖ్యమని గ్రహించవలెను. దానివల్ల మన కేమి ఫలముకలుగునని లెక్కగాచూడక విద్యవచ్చుటయే ముఖ్యమైన ఫలమనుకొన వలెను. మనకు కూటికి గుడ్డకు పనికి వచ్చునా అని చూడక యెవరికైన నెప్పుడైన పనికిరావ చ్చును తెలిసియుండుట మంచిదని అనేక విద్యల నెప్పుడవ కాశముండిన నప్పుడు నేర్చుకొన వలెను. ఇట్లే తమకు తెలిసిన విద్యను దాచిపెట్టుకొనక యితరులకుచెప్పుచుండవలెను. ఇచ్చు టవల్ల తగ్గిపోనిది,ఉచితముగ పుచ్చుకొనుటవల్ల మానభంగము కలిగించనిదేది? విద్య. పాఠశాలలలో చదువులునేర్చినవారు, తీరుబడిగల ధనవంతులు పనిచేయుటవల్ల మానభంగము కలు గునను భ్రమను మానివేసి సామాన్యజనులకు చదువులు నేర్పి సామాన్య జనులయొద్ద పనులను చేయుటనేర్చుకొని అంత కంటే బాగుగాచేయు విధములను కనిపెట్టి వృద్ధిపొందించి నూతన పద్ధతులతో సహ తిరిగి అందఱకు నేర్పవలెను. మఱియు

విషయములో బ్రహ్మజ్ఞానముపోయి మూఢభక్తులు మిగిలినట్లు అన్ని పనుల జేయుటలోను శాస్త్రజ్ఞానముపోయి మామూలు ప్రకారము పని చేయుట మిగిలినది. పై విధముగ విద్యలమీదను, పనులమీదను అక్కర, సరదాకలిగి అవి దేశములో వ్యాపించవలెను కాని ప్రస్తుత పరిస్థితులలో మనదేశమునందలి కోట్లకుకోట్లు జనులకు సరియైన పాఠశాలలను పెట్టుటకు వీలుండదు.

ధనవంతులు, విద్యావంతులు, గొప్పవా రాదలును పనియొక్క ఔన్నత్యమును గమనించక శరీర కష్టమును తప్పించుకొను చుండుటను జూచి సామాన్య జనులును పని అనగానేదోపిశాచము పట్టుకొనె నన్నట్లు విచారపడుచు చేయుచుందురు. మనదేశస్థు లేపని చేసినను పాడేయనియు, మంచిపని, పనివాండ్రు బైట దేశములనుండి రావలెనను భావము వ్యాపించకతప్పదు. దీనివల్ల తుదకు దేశములో జీవనములు తగ్గిపోయి కూలిపనితప్ప యేపనియు లేకపోవును. ప్రవాహము మధ్యనుండు కఱ్ఱఅలలలో లేచుచు పడుచు నెట్లుండునో మనుష్యులు జీవప్రవాహమున నుండు వరకు నేదోపని చేయుచు క్రిందమైన పడుచుండుట సృష్టిధర్మము. "ఉద్యోగం పురుషలక్షణం" అనుటకు బదులు "ఉద్యమం పురుషలక్షణం" అని గ్రహించవలెను. నది మధ్యనుండు కఱ్ఱ ఒడ్డెక్క కదలలేకపోవునట్లు కాళ్ళుచేతులు కదలించ లేకుండు కాలము ప్రతిమనుష్యునకును సమీపించుచునే యున్నది. ఎవ

డైనను ఎప్పుడైతే "నేనేపనియు చేయనక్కరలేదు. నేను కష్ట పడనక్కరలేదు. ఇక ప్రాణముండు వరకు నెమ్మదిగ నుండెద" ననునో, అప్పుడే వాడు జీవప్రవాహమునుండి ఒడ్డెరుక్కు చున్నాడు. శరీరకష్టము తప్పించుకొన దగినదని గాని సోమరి తనము సుఖమనిగాని తలచగూడదు.

పూర్వకాలమున హిందువులకు దేవాలయములు లేవు. బౌద్ధమతము వ్యాపించినవెనుక బుద్ధుని పూజించుటకు దేవా లయము లేర్పడి, బౌద్ధమతము మనదేశములో తొలగిపోయి నను సామాన్యజనుల వినోదార్థమో, యితర కారణముల వల్లనో దేవాలయములుండు పద్ధతి మిగిలిపోయెను. భోజన సమయమున కాళ్ళు చేతులు కడుగుకొనుట, మడిబట్టలు కట్టు కొనుట మొదలగు తొలిపను లెన్నిజేసినను తుదకు ముఖ్య ముగ జరుగవలసినదేది? ఆహారమును స్వీకరించుటకద! ఇట్లే పూజలు ప్రార్థనలు ధ్యానములు మొదలైనవి మనస్సులను దృఢపరచి సమయము వచ్చినపుడు సరియైన పనిని సరియైన బుద్ధితో జేయగలుగుటకే గాని వానివల్ల వేఱుపయోగము లేదు. పూజలు మొదలైన వానివల్లనే కలుగునని భ్రమపడు చున్న ఫలము సత్ప్రవర్తనవల్ల తప్ప వేరువిధమున కలుగదు సత్కార్యములే భగవంతునకు ప్రియమైన పుష్పములు. సత్ప్ర వర్తనే ఆ పుష్పముల నర్పించెడు సార్థకమగు పూజ

మన దేశస్థులకు మతముపై అభిమానమెక్కువ. ఇది మిక్కిలి శుభసూచకము. హిందువులకు దేవాలయములు, తురకలకు మసీదులు, క్రైస్తవులకు చర్చిలు దేశమంతయు వ్యాపించియున్నవి. అయితే ఇండ్లలో లేనిదేవుడు గుళ్ళలో లేడు. పూజలు ప్రార్థనలకు మాత్రమే దేవాలయములకు పోవ నవసరములేదు. పూజలు, ప్రార్థనలకేగాక, నిండ్లలో చేయుటకు వీలుగాని సత్కార్యములను జేయుటకు గూడ దేవాలయము లవకాశమియ్యవలెను. విద్యలను నేర్పదలచిన వారును నేర్చుకొన దలచినవారును చేరు రంగములుగ నుండ వలెను. ఉచితముగ చదువులు చెప్పుటకును, అన్నివిధముల పనులు నేర్పుటకును స్థానములు కావలెను. పరోపకారము జేయదలచినవారు తమ తీరుబడిని బట్టి అనుదినమును దేవాలయములందు గంట, రెండుగంటలసేపు చదువు నేర్పుటకును, ఆ ప్రాంతములో లేని పనులను నేర్పుటకును, ఉన్నపనులనే తెలియనివారికి నేర్పుటకును, మఱింతబాగా చేయుటకును వినియోగించవలెను. చదువులు, విద్యలు మనము నేర్చు కొనుటయు నితరులకు నేర్పుటయు కర్తవ్యము, పుణ్యమని తలచవలెను. "అన్నదానం మహాదానం విద్యాదానం తథో ధికం". దేశాభ్యుదయమునకు, ప్రజాక్షేమమునకు అత్యవసర మైన విద్యలు, శాస్త్రజ్ఞానము లనేకములున్నవి. వానిని నేర్చుకొనుట కష్టము, దీర్ఘకాలము పట్టును. నేర్చుకొను

నప్పుడు కాని నేర్చుకొనిన వెంటనేగాని వానివల్ల ఫలము కనబడదు. కూటికి గుడ్డకు పనికిరావు. అయినను అందఱును అన్నివిద్యలను శాస్త్ర జ్ఞానములను పొందుటకును అందఱికును వ్యాపింప జేయుటకును సదా ప్రయత్నించుచునే యుండవలెను.

పైవిధముననే డబ్బునకు లోబడియుండు నవనాగరీకత పద్ధతినుండి విముక్తి రాగలదు. ఇప్పుడు సామాన్యముగ నొకని కొకపని తెలిసియుండుటయు, అది తప్ప ఉదయము లేచిన ప్పటినుండియు నేది కావలెనన్నను ప్రతిదానికి డబ్బు అవసరమై అనేకులకు జన్మంతయు డబ్బుతోనే యున్నట్లున్నది. ఈ పద్ధతివల్ల డబ్బులేని వారితరమంచి గుణములున్నను కష్టముల పాలగుచున్నారు. ఒక వస్తువును తయారుచేసినవాడు దానివల్ల వీలగునంత సొమ్మునుపొంద ప్రయత్నించవలసి వచ్చుచున్నది. ప్రకటనలు, అబద్ధములు, దగాలు ప్రబలవలసి వచ్చుచున్నది. మంచి చెడ్డలకంటె డబ్బు ప్రధానమైనది. కష్టబడి పనిచేయుటకంటె తెలివిగా అమ్మట కొనుట యెక్కువ లాభకరమైనది. డబ్బు సంగతులు తెలిసినవారు దేశమందలి డబ్బునంతయు వశపరచుకొని ఇతరుల నందఱను తమ యిష్ట ప్రకారము నడిపించ గలుగుచున్నారు. పశ్చిమ దేశములలో నవనాగరికత స్థితి మిక్కిలి దుస్థితిగ నున్నది. మన దేశమందును అదేపద్ధతి ప్రారంభమైనది. పైన జెప్పబడిన చిక్కులు

లేకుండవలెనన్న అందఱకు అన్నిపనులు చేసుకొనుట తెలిసియుండి, ఇప్పుడేదికావలెనన్నను బజారునకుపోయి డబ్బుతో కొనునట్లే సాధారణముగ నెవరికి కావలసిన వస్తువులు వారే చేసుకొనుచుండవలెను. మనుష్యజీవనమునకు ముఖ్యావసరమగు విషయములనైనను, ఈపద్ధతి నవలంబించవలెను. కొలదివిషయములతోనే సులభశైలిని జీవించగల మన దేశస్థులకిది దుర్లభముకాదు. బట్టకుగాను, వడుకుట, నేత; ఆకలిచే బాధపడకుండ ప్రతియింటియందును తాటి, కొబ్బరి, అరటిమొదలైన చెట్లను పెంచుట, ఉపయోగించుట, వ్యవసాయము; సామాన్యనివాసముల గట్టుట; ఈవిషయముల జ్ఞానము ప్రజలందఱకు నుండునట్లు వ్యాపింపజేయవలెను. ఇంకను వారివారి ఓపికను, వ్యవధిని, శక్తినిబట్టి ఎక్కువ విషయములు తెలుసుకొనవచ్చును గాని, బ్రతుకుటకు ముఖ్యావసరమైన విషయములైనను అందఱకు తెలిసియుండవలెను. అనేక విధముల చదువులు, పనులు నేర్పుటకును, చేయించుటకును, పనిలేనివారికి పనియిచ్చి అన్నము పెట్టుటకును దేవాలయములు స్థానములగుచు క్రమముగా సేవాలయములుగ మారవలెను. ఇప్పుడు సాధారణముగ బజారులో దొరకని వస్తువులనే ఇంటియందు చేసుకొనవలెనని చూతుము. పెక్కు సంగతులందఱకు తెలిసియుండి, తమ కవసరమైనవి తామే చేసుకొనజాలనప్పుడే కొనుటకుగాని, ఇతరులచే చేయించుటకుగాని యత్నించవలెను.

ఈ రోజులలో ఒకదేశమువారు మఱొకదేశమునకు సరుకులను పంపుట, సరుకులు దిగుమతి అయిన దేశములో పనులు పాటలు తగ్గిపోయి బాధలుపడుట, స్వదేశవస్తువులనే వాడవలెనని ఉద్యమములు బయలుదేరుట—ఇట్లు మన భరత వర్షముననేగాక, ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మని మొదలైన పశ్చిమదేశములలోను, ప్రపంచమునందన్ని దేశములలోను జరుగుచునేయున్నది. సరుకు లితర దేశమునుండి వచ్చిన నెట్లో ఆ దేశములోనే ఒక ప్రాంతమునుండి ఒక ప్రాంతమునకు వచ్చినను అట్టిబాధలనే కలుగజేయును. ముఖ్యముగ నితరుల కమ్ముటకుగాను సరుకులను తయారుజేయుక, ముఖ్యముగ తమ వినియోగార్థమే సరుకులనుతయారుజేయుటే అట్టిబాధలుకలుగ కుండుటకు మార్గము. స్వదేశోద్యమము చాలదు. వీలగునంత వరకెవరి ప్రాంతములో, నెవరి గ్రామములో, నెవరిగృహ ములో తయారైన వస్తువులనే వారు వాడవలెను. మన అవస రముకన్న నెక్కువగ సరుకులనుత్పత్తిజేసినవెంటనే అమ్ముట, కొనుట, డబ్బుప్రధానమగుట, డబ్బువిషయము తెలిసిన వారికి లోబడియుండుట, యంత్రములకు లోబడి యుండుట సంభవించును. ఈ బాధలన్నియు నిప్పుడు పశ్చిమ దేశము లలోనే ఎక్కువగ నున్నవి. అట్లుత్పత్తిజేయు పద్ధతి మన దేశములో ప్రబలినకొలది మనదేశమందును, అట్టిబాధలు హెచ్చును. ఒకజోడు చెప్పులు కావలెనన్న యంత్రము

వసరము లేదు. ఇతరులకమ్ముటకును, ఎగుమతి జేయుటకును, లక్షలకొలఁది కావలెనన్న యంత్రము లవసర మగుచున్నవి. వీలగువంతవరకు అమ్ముట, కొనుటను నిరసించి యెవరికి కావలసినవి మాత్రము వారు చేసుకొనవలెను. ప్రజల యభిప్రాయ మట్లుండవలెను గాని అట్లుజరుగుట దుర్లభము కాదు. రోమనుల సామ్రాజ్యము గొప్ప దశయందుండిన రోజులలోనే, అగస్టసు అనుపేరుగల చక్రవర్తిభార్య తన యింటియందు తానే వడికి, నేసిన బట్టలను వాడుచుండెను. ఆచక్రవర్తియు నా బట్టలనే వాడుచుండెను. సుకుమారము హెచ్చిపోయి, సులభశైలిని జీవించుశక్తి తగ్గిపోయి ప్రజలు చెడిపోవుచున్నారని చింతించి మార్గదర్శకముగ వారట్లు చేయుచుండిరి. దేనినైనను చేతితో చేసుకొన వీలులేనియెడల నట్టివి అమ్ముటకు గాక తమ వినియోగార్థము చేసుకొనుటకు సత్రములు మొదలైనవి ఉన్నట్లు యంత్రశాలల నుంచవచ్చును. జనులు యంత్రములకు లోబడిపోక వానివల్ల ఫలముల బొందుట కిదేమార్గము.

అనేకులకు మంచి చెడ్డలవిషయమై యోచనేయుండదు. అందువల్లనే అట్టి యోచనలు గలవారికి సరియైన అభిప్రాయములు తమకుండుటయు, తా మభ్యసించుటయు, నితరులకు వ్యాపింప జేయుటయుఁ బాధ్యతయై యున్నది. బలవంతులు మనను బాధించునప్పుడు తప్పంతయు వారిదేకాదు. దుర్బలులై

యుండుట మనతప్పు. శక్తిగలవారు హింసించునప్పుడు తప్పయు వారిదేకాదు. శక్తిహీనులమై యుండుట మనతప్పు. దుర్మార్గము, అసమర్థతతో బుట్టువులు, ఒకేజాతి, ఒకేసంతతి. అనేకులు తమకు కష్టములు వచ్చినప్పుడు "మేము ఏమిచేసినాము" అందురు. చేయరానిపనులు చేయుటెంత పాపమో, చేయవలసినపనులు చేయకుండుటయు నంతపాపమే. సృష్టి యుద్ధరంగమని గ్రహించి తగిన మెళుకువకలిగి ప్రవర్తించుట, సృష్టి ధర్మములను తెలుసుకొనుట, వాని ననుసరించి నడుచుకొనుట, దానివల్ల ననంతమగు శక్తిని, బలమును పొందుట సర్వజనులకు విధాయకము. మన దేశమందు భక్తి, జ్ఞానము (బ్రహ్మజ్ఞానము, సృష్టిజ్ఞానము, శాస్త్రజ్ఞానము) చదువులు, విద్యలు, పనులు బాగావ్యాపించి మనదేశస్థులెక్కుడున్నను నీతిమంతులనియు, బలవంతులనియు, శక్తిమంతులనియు లోకమంతటను పేరు పొందెదరుగాక.

శ్రీయుతంబగు భరతవర్ష మశేషదేశములందు వి
ద్యాయశోబల శౌర్యధైర్యవదాన్యతాకరమౌచు ల
క్ష్మీయుతంబయి పాడిపంటలమేటియై సద్భక్తియుక్
న్యాయవర్తన మొప్ప వెల్గెడునట్లు దైవమొనర్చుతన్.

ఎవరికైనను

కోపమంత కష్టము లేదు

కక్షంత దుఃఖము లేదు

భోగమంత మోసము లేదు

ధర్మమార్గము ప్రవేశింపుడు

(గౌతమ బుద్ధుడు.)

కావున

కోపముమాని శాంతము నభ్యసింపుడు

కక్షలనుమాని సహకారఫలముల బొందుడు

భోగములను మాని త్యాగవైరాగ్యముల నందుఁడు

ధర్మమార్గముజొచ్చి శక్తిని, ముక్తిని బొందుడు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B162 |
| పుస్తకం పేరు | నూతన నీతిబోధ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 135 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | ci, D, uiii, X, BCI |
| లేవి పేజీలు | no |
| తయారు చేసేవారు | Triveni |
| పేజీలు విడదీసేవారు | Triveni |
| స్కాన్ చేసేవారు | Aswini |
| పరీక్ష చేసేవారు | PRAGATHI |
| పేజీలు పరిచూసేవారు | |
| బైండింగు చేసేవారు | |
| ప్యాకింగు చేసేవారు | |
| పరిస్థితి | good |